


ప్రెసిడెంట్

# వి. జె. పటేల్

## జీవితం

జీవితం

సంపాదకులు

పురాణం కుమార రాఘవశాస్త్రి, బి. ఏ.



అరుణ ప్రచురణ
వెరైటీ ఏజన్సీస్,
పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు,
గవర్నరుపేట ★ బెజవాడ.

# విఠల్‌భాయ్ జవర్‌భాయ్ పటేల్

జననం — మృతి

18 జనవరి 1871 — 22 అక్టోబరు 1933

అస్మత్ పితృపాదులు
కైలాసవాసి కంభంమెట్టు బ్రహ్మాజీరావుగారి
పవిత్రస్మృతికి చిహ్నంగా

●

సత్యనారాయణరావు
(ప్రకాశకుడు)

●

నా ఈ ప్రయత్నాన్ని ప్రోత్సహించిన అనంతపద్మనాభశాస్త్రిగారికీ కోరినదే తడవుగా యిందు విషయాలను క్లుప్తీకరించి దీనికో పుస్తకాకృతినిచ్చిన కుమార రాఘవశాస్త్రిగారికీ కృతజ్ఞుడను.

భారతీయుల పూజ్యనాయక శిరోమణి. నైతికధైర్య సంపన్నుడు. సూక్ష్మగ్రాహి. స్వాతంత్ర్యపిపాసి. బొంబాయిరాజధానిలో ఒక కుగ్రామమున సాధారణకర్షక కుటుంబమున జన్మించి, జీవితకష్టములెన్నో అనుభవించి, కేవలము స్వయంప్రతిభచే భారతకేంద్రశాసనసభకు ప్రథమమున అనధికార సభాధ్యక్షపదవి నలంకరించిన తేజశ్శాలి విఠల్‌భాయ్ జవర్‌భాయ్ పటేల్.

ఇట్లు సాధారణపరిస్థితులనుండి ఉన్నతాశయసిద్ధిని సాక్షాత్కరించుకో గలిగిన వ్యక్తులు పాశ్చాత్య దేశాలలో పెక్కుమంది ఉన్నారు. అట్టి అవకాశాలు ఆ రాజ్యములలో కలవు. వడ్రంగము వృత్తిగా కాలక్షేపము చేసుకొనుచుండిన జేమ్స్ గార్‌ఫీల్డు అమెరికా అధ్యక్షుడైనాడు. గనులలో ఒక చిన్న యుద్యోగిగా నుండినవాడు బ్రిటిష్ ప్రధాన మంత్రి గాగలిగెను. ఐరోపీయ రాజకీయ చరిత్రలో ప్రఖ్యాత వ్యక్తు లనదగిన ముస్సొలినీ, హిట్లర్, డివెలరా మొదలైనవారు మొట్ట మొదట సాధారణ వ్యక్తులే. ఇట్టి ఉదాహరణలు భారత చరిత్రలో బహు అరుదు. స్వయం శక్తితో పురోగమియైనవాడు ఒక్క విఠల్ భాయి మాత్రమే కనిపించుచున్నాడు.

మొక్కవోని పట్టుదల, స్వతంత్రపుటూహలు అతని యున్నతికి దోహదములైనవి. అతనిసత్య ప్రియత్వము కొనియాడదగినది. భారత స్వాతంత్ర్యోద్యమనిరోధకులతో ఎంత తీవ్రముగ రాపాడెనో, తప్పు త్రోవన బోయినప్పుడు కాంగ్రెసు మిత్రులను గూడా అంత తీవ్రముగనే విమర్శించెను. జంకుగొంకులు లేవు. మొహమోట మసలే లేదు.

ఈమహనీయుడు తన అరవైరెండవ యేట పరదేశములో పరమపదించెను. అప్పుడు మాతృదేశమున కాతని యవసర మెంతయైన నుండెను. తాను కూడా తొందరగ స్వదేశము వెళ్ళిపోవలెనని తహతహలాడెను. కాని విధి అన్యథా తలచెను. విదేశమందే యాతడు మాతృభారతిని తలచు

కొనుచు ఊపిరి విడిచినాడు. భారతీయాంబరాన ఒక ఉజ్వల మహనీయ తార ఎగ(బ్రాకి వచ్చినది.

**జననము: బాల్యము** విఠల్ భాయ్ పటేల్ 1871 ఫిబ్రవరి 18 వ తేదీన గుజరాత్‌లోని ఖైరాజిల్లా కర్సాద్ గ్రామములో జన్మించినాడు. వారు ముగ్గురన్నదమ్ములు. పెద్దవాడు కొన్నిసంవత్సరాల క్రితమే మరణించెను. మిగిలిన యిద్దరు విఠల్ భాయ్, వల్లభాయ్‌లు. వీరు నవ్యభారత నిర్మాతలుగా పేరందినారు. గుజరాత్ ప్రజలు కష్టసమయములందెల్ల వీరి సహాయమును, సలహాలను అర్థించినారు.

హైందవసంఘ సాంప్రదాయాలు అందరెరిగినవే. అనేక గుడ్డి నమ్మకాలతో, అర్థములేని ఆచారములతో నిండియున్నది వారి మతము. నిష్టలు, నియమాలు, పల్లెటూళ్ళప్రజలకు మరీయెక్కువ. దూర ప్రయాణాలు చేయుటకూడ వారికినిషిద్ధము. అయినను సుమారు అరవై సంవత్సరాలక్రితమే ఈ పటేల్ కుటుంబము స్వగ్రామమువిడిచి అహమ్మదాబాదు - బొంబాయి ప్రాంతాలకు వలసవెళ్ళినది. దీనినిబట్టి యది స్వతంత్రపు టూహలుగల, నవనవోత్సాహము పొంగులువారుచున్న కుటుంబమని చెప్పదగును.

చిన్నతనమున విఠల్ భాయ్ గడుసరియని పేరుగాంచెను. అతడెవరికిని జంకెడువాడు కాడు. తోడిబాలురను సర్వదా ఏడిపించుచుండెడివాడు. ఈ తుందుడుకుతనమును పెద్దలైనవారు నిరసించుచుండిరి. ఈ అల్లరిపిల్లవానిలో ఎంతతేజమో నిద్రాణమైయున్నవిషయము వారికప్పుడు అవగతము కాలేదు.

కర్సాద్‌లో బడిచదువు పూర్తిచేసుకొని విఠల్ భాయ్ ఉన్నత విద్యకై నాడియాడ్ వెళ్ళెను. అనతికాలములో ప్లీడరుపట్టా సంపాదించెను. 1904 లో విఠల్ భాయ్ పాస్‌పోర్టుతీసుకుని బార్ - అట్ - లా చదువునిమిత్తము ఇంగ్లండుకు పయనమై వెళ్ళెను. జన్మతః అతడు భాగ్యవంతుడుకాదు; ప్లీడరీవృత్తిలో అప్పటికి సంపాదించినదికూడ ఎక్కువలేదు. కాగా అతనికి రోజులు ఇంగ్లండులో కష్టముమీదనే గడచెను. సాధారణముగ భారతీయ యువకులు విదేశాలకు పోయి ఇచ్చవచ్చినట్లు ధనము దుర్వ్యయముచేసి భోగజీవితము గడుపుచుందురు. విఠల్ భాయ్ అట్లుగాక మెళుకువతో తనరాబడి యెరిగి ప్రవర్తించెను. మితవ్యయమున

కలవాటుపడినవాడు కనుక ఆతడంత బాధపడలేదు. నిరాడంబరముగనే జీవయాత్ర గడుపుకొనెను. మాంసము తినెడివాడు కాదు. విలువగల దుస్తులకోసము ప్రాకులాడలేదు. మామూలు ఆహారముతోనే తృప్తి పడెను. స్వదేశమునందే ప్లీడరు పరీక్ష నిచ్చినవాడుకనుక, కొంతకాలము గుజరాత్ కోర్టులలో ప్రాక్టీసు చేసియున్నందున, కొన్ని కేసులలో అనుభవ మార్జించినాడు కాబట్టి అప్పటికే ఆతనికి మానవుల మనస్తత్వము చాలవరకు అవగతమై యుండెను. ఈ పరిజ్ఞానము తరువాత అతని రాజకీయ జీవితమునందును, దేశసేవాపరత్వము నందును ఎంతయైన ఉపయోగించినది.

ఈ మహనీయుడు తన యావత్తు జీవితమును దేశసేవకే అంకితము చేసెను. దేశసేవ తప్ప ఆతనికి మరియొక కార్యక్రమము లేదు. దురదృష్టవశమున 1908 లో ఆతడు స్వదేశానికి తిరిగి రాగానే ఆతని భార్య మరణించెను. అతనికి కలిగిన యీ నష్టము దేశమునకు లాభకారి యయ్యెను. తదాదిగా అతడు తన సర్వశక్తులను స్వదేశోద్ధరణకే వినియోగించినాడు. ప్రజలే తానను కున్నాడు. ప్రజలు తన్నే నమ్మినారు. ప్రజలనే యాతడు సేవించెను. ఇద్దరన్నదమ్ములును గుజరాత్‌లో ప్రాక్టీసు ఆరంభించి కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించినారు. కాని కేవలము ధనార్జనమే వారి యాశయము కాదు.

**బొంబాయి కార్పొరేషన్‌లో పటేలు**

విఠల్‌భాయ్ ఎల్లవేళల ప్లీడరు వృత్తి యందే నిమగ్నుడై యుండలేదు. బొంబాయికి నాతిదూరమందున్న బంద్రా ప్రాంతపు సివిల్ వ్యవహారములలో జోక్యము పెట్టుకొనుచుండెను. 1922-23 లో ఆతడొకపార్టీని లేవదీసి బొంబాయి మునిసిపాలిటీలో ప్రవేశించెను. కే. యఫ్. నారిమన్, జమన్‌దాస్ మెహతా, మోతీలాల్ నెహ్రూ మొదలగు వారతనికి పట్టుకొమ్మలై నిల్చిరి. బొంబాయి మునిసిపాలిటీలో అభ్యుదయకరములైన మార్పులు తెచ్చి, దానినొక చక్కని ఆదర్శప్రజాస్వామిక సంస్థనుగా చేయవలెనని పటేల్ ఆశయము. అందుకు తగిన కర్మవీరులు కావలెగదా! ఎన్నికల సంరంభము సాగించెను. ఎంతో పట్టుదలతో, చురుకుదనముతో పనిచేసెను. ఒక్కమాసము రోజులకాలములో బొంబాయిలోని వివిధ వార్డులలో మొత్తము 250 మీటింగులలో ఉపన్యసించెను. మునిసిపల్ పరిపాలనా విధులను గూర్చి ప్రజలకు బోధపరచెను. ఆఫీసర్లు సాగించుకొనుచుండిన

అకార్యకరణములను వెల్లడిచేసెను. ఈ విధముగ జాతీయవాదుల ప్రచారము తీవ్రముగ సాగినది. చివరకు కార్పొరేషన్‌లోనికి వారే అధికసంఖ్యాకులుగ వచ్చినారు. పూర్వపు ఆఫీసర్ల...(జోహుకుందారుల) గుండెలలో బెదురుపుట్టినది. జంకిపోయినారు.

విఠల్‌బాయ్ పటేల్ నాయకత్వమున ఈ జాతీయవాదులు బొంబాయి కార్పొరేషన్‌లో 'ఎన్నో అభ్యుదయకరములైన సంస్కరణలు ప్రవేశపెట్టి దానిని చాలవరకు ఒక ప్రజాస్వామిక సంస్థనుగా తయారు చేయగలిగినారు. ఎక్కువమంది ప్రజలకు మునిసిపల్ వోటింగు హక్కు లభించింది. ఖద్దరు ప్రచారము ఎక్కువగా సాగినది. స్వదేశ వస్తూత్పత్తి, వాటి విక్రయము హెచ్చినది. ఆయుర్వేద, యూనానీ మొదలగు దేశీయ వైద్య శాస్త్రిలకు ఆదర ప్రోత్సాహములు లభించినవి. దేశీయ వైద్యశాలలు అన్ని వార్డులలోను స్థాపితము లయ్యెను. ప్రజారోగ్య రక్షణకై అచ్చటచ్చట తాలింఖానాలను నెలకొల్పిరి. అంతకు పూర్వము కొన్ని కోట్ల రూపాయల అప్పులో మునిగియున్న బొంబాయి కార్పొరేషన్‌ను విఠల్‌భాయ్ పటేల్ సముద్ధరించినాడు.

ఎన్నాళ్ళనుండియో గవర్నర్లకు, వైస్రాయికి స్వాగత పత్రాలు సమర్పించు మునిసిపాలిటీ ఆచారము రద్దు గావింపబడెను. ఆ విధముగా ప్రజల సొమ్ము వమ్ము కాకూడదని పటేల్ ఉద్దేశము.

మునిసిపల్ కమిషనరులను ప్రజలే ఎన్నుకోవలెను. వారిని ప్రభుత్వం నియమించు ఆచారము పోవలె. అప్పుడుగాని మునిసిపల్ పరిపాలన స్వపరిపాల శాఖక్రిందకి రాజాలదు అని పటేల్ భావము. జాతీయ వాదుల సాయముతో, రేటు పేయరుల సౌఖ్యమే దృష్టియందుంచుకుని విఠల్‌భాయ్ పటేల్ కార్పొరేషన్ వ్యవహారములను నిర్దుష్టముగ కొనసాగించెను. 1922 మొదలు 1925 వరకు బొంబాయి కార్పొరేషన్‌లో కాంగ్రెసు ఆధ్వర్యమే సాగినది. 1925 లో విఠల్‌భాయ్ బొంబాయి శాసన సభలో ప్రవేశించెను. అతడు మొదట పాఠశాలల కమిటీకి అధ్యక్షుడుగ నుండెను. ప్రజలాతని సేవాదీక్షను గమనించి మునిసిపాలిటీ అధ్యక్షునిగా ఎన్నుకొనిరి.'

ఒకప్పుడు బొంబాయి కార్పొరేషన్‌వారు కర్జన్ ప్రభువుకు స్వాగత మీయవలెనని సంకల్పించిరి. ఆతీర్మానమును సర్ ఫిరోజిషా మెహతా నెగ్గనీయలేదు. అట్లే విఠల్‌భాయ్ పటేల్‌గూడ అప్పుడు

వైస్రాయిగానుండిన రీడింగ్ ప్రభువునకు బొంబాయి మునిసిపాలిటీ స్వాగతపత్ర మీయరాదనెను. ఆరోజులలో రీడింగుప్రభువు విక్టోరియా రాణి ప్రకటనకు విరుద్ధముగా ... భారతప్రజల ఆశయాలకు వ్యతిరేక ముగా ... నిరంకుశముగా ప్రవర్తింపదలచెను. కాని ఆనాడు పటేల్ మాట నెగ్గలేదు. చాలమంది సభ్యులాతనిని విమర్శించిరి. అతనిప్రవర్తన సవ్య ముగా లేదనిరి. అందుమీద అతడు తన అధ్యక్షపదవికి రాజీనామా యిచ్చెను. కాని మరల ప్రజలాతనినే ఎన్నుకొనిరి. అతనిమాటయే ప్రజల యభిప్రాయము ... అని స్పష్టపరచిరి.

ఒకవంక ప్రభుత్వపు జోహుకుందారులతో రాపాడుచు, మరొక వంక బొంబాయి ప్రజల క్షేమముకొరకు పాటుపడుచు విఠల్ భాయి మునిసిపల్ వ్యవహారాలను చక్కదిద్దగలిగెను. ఈ కార్పొరేషన్‌లో ఆతడు గడించిన యనుభవముతో తరువాత శాసనసభలో కూడ పెక్కు విజయము లార్జించినాడు.

విఠల్ భాయ్ పటేల్ త్రికరణ శుద్ధిగల రైతు బాంధవుడు వ్యక్తి. దయాళువు. ఇతరుల కష్టాలు చూచి ఓరువలేడు. కార్యదీక్షాపరత్వము మూర్తి గట్టినవాడు. ఇట్టి సద్గుణములచేతనే యాతడు గుజరాత్ ప్రజల ప్రియ తముడైనాడు.

అనాదినించీ మనదేశములో రైతులు దీనాతి దీనావస్థలలో ముగ్గు చున్నారు. స్వదేశీయులుగాని, ప్రభుత్వముగాని వారి కష్టాలను గమనించ లేదు. దాని స్వరూపఫలితమే బార్డొలీసత్యాగ్రహము. విఠల్ భాయిపటేలు సోదరుడు వల్లభాయ్ పటేల్ అధ్వర్యమున అది విజయవంతముగా సాగిన విషయము జగద్విదితము.

ప్రభుత్వము శిస్తులను నూటికి 22 వంతులు హెచ్చుచేసినది. అది అన్యాయమనియు, ల్యాండ్ రెవిన్యూకోడ్ షరతులకు విరుద్ధమనియు బార్డొలీ ప్రజలు ప్రభుత్వపు చర్యను ప్రతిఘటించి, శిస్తులు చెల్లించుట మానివేసి, సత్యాగ్రహము పూనిరి. ఈ యుద్యమమునకు గాంధిజీ ఆశీ ర్వాదము కలదు; విఠల్ భాయ్ సానుభూతియు ఉన్నది.

ఈ బార్డొలీప్రజల యాందోళనము సందర్భమున విఠల్ భాయ్ గాంధిజీకి వ్రాసిన యుత్తరమొకటి గమనింప దగియున్నది.

"బార్డోలీ సత్యాగ్రహ సమరమును నేను పర్యవేక్షించినాను. బార్డోలీ రైతుల యాందోళనము న్యాయబద్ధమైనదని నానమ్మకము. వారు నిష్పాక్షిక విచారణమును వాంఛించుచున్నారు. తమకష్టములను తొలగింపు దనియేకదా వారి గోడు! అయినను ప్రభుత్వము వారియెడ దమననీతిని ప్రయోగించుట గర్హ్యము; హద్దుమీరిన హింసాప్రవృత్తుల నవలంబించి శిస్తులు వసూలు చేయ గోరుచున్నది.

ఇట్టి పరిస్థితులలో నేను చేతులు ముడిచిపెట్టుకొని ఊరక కూర్చొనలేను. బార్డోలీ సత్యాగ్రహము నిమిత్తము నిధి ప్రోగుచేయు చున్నారుకదా! నేనుకూడ ఒక వేయిరూపాయ లానిధికి సమర్పించుకొను చున్నాను. ప్రస్తుతమునకు బార్డోలీ రైతులయెడ నేనుచూపు సానుభూతి ఇదియే. ప్రభుత్వపు దమననీతిని నిరసించుటయు నిదియే. ఈయుద్యమము సాగినంతకాలము ప్రతిమాసము నేను వేయిరూపాయలు నిధికి సమర్పించు కొనుచుందును. బార్డోలీరైతులకు ఎప్పుడు ఏవిధమైన సాయముచేయుట కైనను నేను వెనుకాడునదిలేదు"

రైతుబిడ్డల యెడ ఈతనికిగల అపార ప్రేమకు ఈ యుత్తరమొక తార్కాణము. చివరకు బార్డోలీ రైతులకే విజయము చేకూరినది. ప్రభుత్వము లొంగిరాక తప్పలేదు. R. S. బ్రూంఫీల్డు; R. N. మేక్స్వెల్ అనువారితో ఒక విచారణ సంఘము నియమింపబడెను. బార్డోలీ రైతుల యలజడి న్యాయబద్ధమని వారు ఒప్పుకొనిరి. పూర్వపు శిస్తులపై నూరింట ఆరువంతులు మాత్రమే హెచ్చించి ప్రభుత్వము రైతులతో సంధి గావించుకొనెను. ఈ బార్డోలీ విజయము ప్రజలకొక నూతన శక్తి నిచ్చెను. తమ హక్కులకొరకు పోరాడగల ధైర్యము, అందుకు వలసినంత త్యాగముచేయు సాహసము వారికి అబ్బినది.

ఈ బార్డోలీ సమరమునకు విఠల్‌భాయ్ యొసగిన చేయూత... రైతులయెడ అతనికిగల ప్రేమను, దీనులను రక్షింపవలెనన్న యాతృతను వెల్లడిచేయుచున్నది. రైతు-ఉద్యమములో కలుగజేసుకొనుట అతని కిదియే ప్రథమ పర్యాయముకాదు. ఇంతకు పూర్వమొకసారి 1918 లో శ్రీగోకులదాస్ కహాన్‌దాస్ పరేఖ్‌తో కూడా కలసి కైరాజిల్లా రైతు లను, వారి వ్యావసాయిక పరిస్థితులను దర్శించి వచ్చెను.

హరిజనుల యెడ ప్రేమ

విఠల్ భాయ్ పటేల్‌కు హరిజనుల యెడ గల అపార ఆదరాభిమానములకు గాంధీజీయే ఈ విధముగా సాక్ష్యమిచ్చుచున్నాడు:

"1916 లో నేను గోధ్రా వెళ్ళితిని. అక్కడ ఒక రాజకీయ సమావేశము జరుగనుండెను. అదే సమయమున అక్కడ ఒక హరిజన సమావేశము కూడ జరుగుచుండెను. రాజకీయసమావేశమునకు వచ్చిన వారినందరను నేను హరిజనులవాడకు రండని యాహ్వానించితిని. వారి సమావేశమును గూడ అక్కడే జరుపుకొనవచ్చునని చెప్పితిని. తీరా నేనక్కడికి వెళ్ళినప్పుడు నా కంటబడిన దృశ్యమును నే నొక్కనాటికిని మరువలేను. అందరికన్న ముందుగా అక్కడ విఠల్ భాయ్ పటేల్ వచ్చి యున్నాడు. శాసనసభాధ్యక్షు డచ్చట రైతువేషములో, సాధువులు ధరించు టోపీ పెట్టుకుని, హరిజనులలో తానొక హరిజనుడై, వారితో కలసి మెలసి తిరుగుచుండెను. హరిజనోద్యమము పట్ల ఆతనికి సానుభూతి మెండు. సనాతనులను సంతోష పెట్టుటకై తన స్వీయ అభిప్రాయాలను దాచుకొనెడివాడు కాదు..."

---

# 2
## శాసన సభా ప్రవేశము

1909 లో మింటో - మార్లే సంస్కరణలు అమలులోనికి వచ్చినవి. లాన్స్‌డౌన్ కాలమునాడు ప్రవేశపెట్టబడిన సంస్కరణల కివి యను-బంధము లని చెప్పనగును. అంతియేగాని ఈ మింటోమార్లే సంస్కరణల వలన పూర్వపు పరిపాలనా చక్రము పూర్తిగ మారినది లేదు.

పరిపాలనా విధానమును కొంతవరకు ప్రజలు ఆకళింపు చేసుకొన గలందులకై ఈ సంస్కరణలు ఉద్దేశింపబడినవి. శాసనసభ్యుల సంఖ్య హెచ్చినది. శాసనసభలలో ప్రజా ప్రతినిధుల సంఖ్యకూడ హెచ్చినది. పరిపాలనా విధులలోను, ఫైనాన్సు విషయము లందును సభ్యులకు కొంత అధికారము చేజిక్కినది. ప్రజలకు సంబంధించిన సమస్యలను కూడ శాసన సభ్యులు చర్చింప వచ్చును.

ఒకసారి బెంగాలు శాసనసభలో లార్డుకార్ మైకేల్ చెప్పినట్లు "ప్రభుత్వము శాసనసభలకు బాధ్యత వహించి యుండనంతవరకు శాసన సభలలో ప్రభుత్వపు ఓటములు సంభవించినను ప్రయోజనం లేదు" అయినను ఈ సంస్కరణలు గమనింపదగినవే. కాంగ్రెసుకూడ హర్షించి నది. గోఖ్లేవంటి నిశిత విమర్శకుడుకూడ 'అవి ఉదారములైన, న్యాయ మైన సంస్కరణలే" అని పలికెను.

**బొంబాయి శాసన సభా ప్రవేశము**

విఠల్‌భాయ్‌పటేల్ మంచి రాజకీయ నేతృత్వముగల ప్రతిభాశాలి. జాతీయవాదులు శాసనసభలలో ప్రవేశించి, అవకాశముల నుప యోగించుకొని, తమ యుద్యమమును బలపరుచు కొన జాలుదురని యభిప్రాయపడినాడు. వెంటనే తన ప్లీడరీ వృత్తికి స్వస్తి చెప్పెను. బొంబాయి శాసనసభాప్రవేశము చేసెను. అప్పుడు లార్డు వెల్లింగ్‌డన్ బొంబాయి గవర్నరుగా నుండెను. శాసనసభాధ్యక్షుడు కూడ గవర్నరే. ఆయన విఠల్‌భాయ్ ప్రతిభా విశేషములను, చాకచక్య మును, సామర్థ్యమును గుర్తించెను.

శాసన సభా ప్రవేశము చేసినంతనే మన నాయకునిలోని ఉత్సాహ ప్రభుమంత్రశక్తులు ఉబికి వచ్చినవి. క్షణకాలము వృధాపుచ్చలేదు. ముఖ్యముగా రైతుల క్షేమముగూర్చి విచారించెను.

పటేల్ అనేక సాంఘిక సంస్కరణలు ప్రవేశపెట్ట దలచెను. హిందూసంఘములో వర్ణాంతర వివాహములను అంగీకరించుచు ఆతడొక చట్టము ప్రతిపాదించెను. కాని విజయము పొంద జాలకపోయెను. తరువాత ఈ చట్టమునే మరల ఇంపీరియల్ కౌన్సిల్‌లో కూడ ప్రతిపాదించి విఫలుడయ్యెను. రెండు దఫాలును సనాతనుల యాందోళనము మిన్నంటెను. పటేల్ కృషి వ్యర్థమయ్యెను. అంతమాత్రమున ఆతని కీర్తికి వచ్చిన లోటులేదు. సంఘోద్ధరణముగా ఆతడు పాటుపడినది!

సాంఘికముగనే గాక, వైజ్ఞానికముగ, రాజకీయముగను తనదేశీయులను మున్ముందుకు తీసుకొనిపోవలెనని పటేల్ ఆశయము. అందుకనియే ఆతడు బొంబాయి శాసనసభలో ఎడ్యుకేషన్ ఆక్టును ప్రవేశపెట్టెను. ఇంతకుముందు గోపాలకృష్ణ గోఖ్లే తనరాష్ట్రములో నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టుటకు ప్రయత్నించి విఫలుడయ్యెను. అధికారులు ఒప్పుకొనలేదు.

బొంబాయి శాసనసభలో పటేల్ ఐరిష్‌పద్ధతి నవలంబించెను. అనగా గవర్నమెంటు బిల్లులను వ్యతిరేకించుట. కాని పటేలూ ఆతని అనుయాయులు శాసనసభలో మైనారిటీ అయినందున ఆబిల్లులను త్రోసి వేయలేకపోయిరి. ప్రతిఘటనమాత్రము ఉండెడిది.

శాసనసభ్యుడు పటేల్‌నుగురించి అప్పుడు ఇండియా కార్యదర్శిగా మాంటేగ్ ఇట్లు చెప్పుచున్నాడు—

"వెలింగ్డన్ శాసనసభా సభ్యుడైన పటేల్‌తో చాలసేపు మాట్లాడినాను. శాసనసభలలో ప్రజాసమస్యలనుగూర్చి యెక్కువగా చర్చించు నవకాశములులేవని యాతడన్నాడు. దేశీయవైద్యమును ప్రోత్సహించు నిమిత్తము తానొకతీర్మానము ప్రతిపాదింపగా ప్రభుత్వము దానిని త్రోసివేసినది. ప్రభుత్వవ్యయము తగ్గింపవలసినదిగా కోరుచు ఆతడు యేబది తీర్మానములు తయారుచేసెను. కాని ఫైనాన్సుసభ్యుడు వాటి నన్నింటిని త్రోసిరాజనెను. ప్రభుత్వ వ్యయమునుగూర్చి చర్చించునవ కాశము ఫైనాన్సు కమిటీయందైన కల్పింపుడని పటేల్ కోరెను. ఆకోరికగూడ నిరాకరింపబడెను. చిట్టచివరకు నిర్బంధ విద్యావిధానమును

ప్రతిపాదించు తీర్మానముగూడ ప్రభుత్వసభ్యులు నిరాకరించిరట. మొత్తముమీద శాసనసభలో ఎక్కువ గల్లంతుచేసినవాడు పటేల్." 

వీగిపోయినను పటేల్ తీర్మానములు దేశీయులదృష్టిని, హృదయమును ఆకర్షించినవి. శాసనసభలో ఆతడుగావించిన యుపన్యాసములలో, ప్రసంగములలో భారతీయుల నవ్యచైతన్యము, భావిఆశయము ప్రతిఫలించినవి. ఈప్రతిబింబాలను అన్యదేశీయులుకూడ చూడగలిగిరి.

**ఇంపీరియల్ కౌన్సిలులో విఠల్ భాయి**

తరువాత శ్రీ విఠల్ భాయ్ రాష్ట్ర శాసనసభను వీడి ఇంపీరియల్ కౌన్సిల్ లో ప్రవేశించెను. వీరి నిజమైన రాజకీయజీవితమిచ్చటనే ఆరంభించినది. ఆతని రాజకీయ నేతృత్వము పువ్వులు పూచినదికూడ ఇచ్చటనే.

'రాష్ట్రీయ స్వపరిపాలనము' (Provincial autonomy)అనుశబ్దము రాజకీయరంగమున విస్పష్టముగ వినిపించని రోజులలోనే... రాష్ట్రీయ ఆదాయములపై ఆధారపడకుండ నుండగల కేంద్రప్రభుత్వ స్వరూపమును మన విఠల్ భాయ్ దర్శించెను. 1920 ఫిబ్రవరి 23 తేదీని ఇంపీరియల్ కౌన్సిల్ లో అతడొక తీర్మానము ప్రవేశపెట్టెను. ఆర్థికముగా కేంద్ర ప్రభుత్వము రాష్ట్రములపై ఆధారపడకుండ, స్వయంపోషకముగ ఉండవలయుననియే ఆ తీర్మానములోని ఆశయము.

కాని ఆ తీర్మానము నెగ్గలేదు. అయినను శ్రీనివాసశాస్త్రి, బి. యన్. శర్మ, సర్ దిన్ షా వాచా, సచ్చిదానందసిన్హా, సర్. గంగాధర్ చిట్నవిస్, సురేంద్రనాథబెనర్జీ జి. యస్. కపర్ది మొదలగు ప్రముఖులా తీర్మానమును బలపరచిరి.

ఢిల్లీ ప్రభుత్వము రౌలట్ చట్టమును ప్రసవింపనున్న రోజులవి. వల్లభాయ్ పటేల్ ఢిల్లీలోనే కే. వి. రంగస్వామి అయ్యంగారి యింటిలో బసచేసియుండెను. ఎట్లయిన ఆచట్టము అమలులోనికి రాకుండా అణచవలెనని యాతడు కావించిన ప్రయత్నములనేకములు. వట్టి విషగర్భితమైన చట్టముగ? ఎట్టకేల కెట్టులో ప్రభుత్వము ఈచట్టమునకు ముగ్గురు పలుకుబడిగల ప్రముఖసభ్యుల మెడలు వంచి వారి యంగీకారమును బడసినది. ఈసంగతి యతిరహస్యముగ నుంచబడెను. కాని ఎట్లో ఒక పత్రికావిలేఖరి దానిని పసిపట్టెను. వెంటనే యాతడు వల్లభాయ్, కపర్ది మొదలగు వారితో సంప్రదించి కలకత్తాలోని 'అమృతబజార్' పత్రిక

కొక వ్యాసము పంపెను. మంచి యదనున అది ప్రచురిత మయ్యెను. ఆముప్పుదు ప్రముఖసభ్యులును జననిందకు వెరచి, తమ యంగీకారమును ఉపసంహరించుకొని అపొజిషన్ పార్టీలో చేరినారు. కాని అప్పటి శాసన సభలలో ప్రజాభిప్రాయమునకు విజయము చేకూరు అవకాశములు లేవు కదా! ఎంతగా ప్రతిఘటించి వాదించినను లాభముండదని పటేలు ప్రభృతులు నిరాశచెందిరి. కొలది రోజులలో మాంటేగ్ - చెమ్సుఫర్డు సంస్కరణలు రానున్నవి. వాటిని బట్టి శాసనసభల స్వరూప మేమైన మంచికి మారునేమో! ఇట్టి యాసతో ఈరౌలట్ చట్టమును ఆరునెలల పాటు అమలుచేయకుండ నుండవలసినదిగా పటేలు ఒక ఎమెండు మెంటును ప్రతిపాదించెను. కాని ఏమిలాభము? ఈదేశములో వైస్రాయి కార్యవర్గము సర్వస్వతంత్రము, నిరంకుశము కదా!

ఈ రౌలట్ చట్టమును ప్రతిఘటించుటలో విఠల్ భాయ్ పటేల్ తన అనుయాయులతో కూడ ప్రదర్శించిన ధైర్యము, పట్టుదల శ్లాఘా పాత్రములు. 1919 మార్చి 13 వ తేదీన చెమ్సుఫర్డు కౌన్సిల్ సమావేశ మును...ఎన్నడును లేనిది ఒంటిగంటవరకు సాగించి, చివరకు చట్టమును దేశములో విడిచెను.

ఈ రౌలట్ చట్టమే తరువాత పంజాబ్ దురంతములకు దారి తీసినది. ఆతరుణమున పంజాబ్‌లో మార్షల్ లా ప్రవేశపెట్టినారు. అచ్చట ప్రభుత్వము కావించిన దురంతములు, అన్యాయములు అమానుషము లని పించుకొన్నవి. భారతజాతిని అవమానించుటకు ఉద్దేశింపబడినట్లు అర్థ మైనవి. ప్రభుత్వము ప్రజలపై క్రూరాతిక్రూరములగు శిక్షలు విధిం చెను. భారతీయులకే కాదు. సభ్య ప్రపంచమున కంతకు దుస్సహములైన చర్యలచేయ ప్రభుత్వము పూనుకొన్నది.

అంత దారుణ హింసాకాండకు దారితీసిన రౌలట్‌చట్టమును విఠల్ భాయ్ పటేల్ తన శాయశక్తుల ప్రతిఘటించుటలో ప్రజాభిప్రాయము నకు అనుగుణ్యముగ ప్రవర్తించెను. తరువాత మాంటేగ్ - చెమ్సుఫర్డు సంస్కరణలు వచ్చినవి. కాని రౌలట్ ఆక్టు కారణముగా కాంగ్రెస్ శాసనసభా బహిష్కారమును తీర్మానించెను. కాంగ్రెసు అనుమతి ననుస రించివిఠల్ భాయ్ తదుపరి యెన్నికలలో నిలువలేదు.

---

# 3

## ఆనాటి కాంగ్రెసు రాజకీయాలు

విఠల్ భాయ్ పటేల్ రాజకీయములలో అడుగిడినప్పుడు కాంగ్రెసులో అభిప్రాయ భేదములు కలవు. అతివాదు లుండిరి; మితవాదులును కలరు. బెంగాలులో 'అమృతబజార్' పత్రికా సంపాదకులు అతివాదులు. బొంబాయిలో లోకమాన్య బాలగంగాధర తిలక్ అతివాది. కాని పైవారు ముఖ్యముగా పత్రికా సంపాదకులు. దేశ నాయకత్వము వారికి గౌణము. కాని తిలక్ మాత్రము దేశసేవయే ఏకైక దీక్షగా పెట్టుకొనిన జాతీయవాది. ప్రజాశక్తిని సమీకరించుటయే అతని కార్యక్రమము. అందు కాతడెంత త్యాగము చేయుటకైనను సిద్ధముగ నుండెను. ప్రజలపక్షము వహించి అనిమిషకార్యదీక్షాకంకణుడైన తిలక్‌పై ప్రభుత్వమునకు కన్నెఱ్ఱపుట్టుటలో ఆశ్చర్యములేదు.

1891 లో ఏదో నేరముమోపి ప్రభుత్వము లోకమాన్యుని బంధించినది. గోఖ్లేవలె యాతడు కూడ చేసినదానికి పశ్చాత్తాపము వెలిబుచ్చినచో విడిచిపుచ్చుదుమని ప్రభుత్వము చెప్పెను. ఈ సందర్భములో అమృతబజారు పత్రికా సంపాదకులు లోకమాన్యున కొక జాబు వ్రాసిరి. దాని కాతడీ విధముగ ప్రత్యుత్తరము వ్రాసెను:

"ప్రభుత్వము నన్ను తప్పుజేసినట్లు ఒప్పుకొను మనుచున్నది. చేయని తప్పు చేసినానని నేను చెప్పుకోజాలను. ప్రజలలో నాస్థానము నా నడవడికను బట్టి యుండును. ప్రభుత్వము నన్ను శిక్షించెనా అంతకన్న అన్యాయపు తీర్పు ఉండబోదు. దాస్యశృంఖలాలతో మహారాష్ట్రములో నుండినను, అండమాన్ దీవులలో నుండినను ఒక్కటియే. దేశసేవయే పరమావధిగ నెన్నువారికి ఇట్టి కష్టములు సంభవించక తప్పదు. రాజకీయాలలో నెగ్గవలెనంటే ఇట్టివానికి భయపడరాదు. నేను వ్రాసిన వ్యాసములు రాజద్రోహ నేరముక్రిందికి రావు. వచ్చునని ప్రభు

త్వపు సలహాదారులు అభిప్రాయపడుచున్నారు. వారిది పొరపాటు అని చెప్పదలచినాను. ఆ మాటలు ప్రభుత్వమును తృప్తిపరుప నేరవు, నాకు తెలియును. పూనా నాయకులను అవమానించుటయే ప్రభుత్వపు కోరికగా కనిపించుచున్నది. నేను గోఖ్లే వలె ప్రవర్తింపజాలను. మనమందరము ప్రజా సేవకులము. ఇట్టి క్లిష్ట పరిస్థితులలో మనో నిబ్బరము లేక జారి పోయితిమా, ప్రజలను మోసగించినవార మయ్యెదము..."

తిలక్ ప్రదర్శించిన యీ ఆత్మ విశ్వాసము, ధైర్యము మన విఠల్ భాయ్‌లో కూడ చూడనగును. ప్రథమములో అఖిలభారత కాంగ్రెసు సంస్థ అర్జీల ద్వారా, అభ్యర్థనల ద్వారా ప్రభుత్వముపై ఒత్తిడి కలిగించి మార్పులకు ప్రయత్నించు చుండెను. రానురాను అతివాదులైన తిలక్, కపర్డీ, లజపతిరాయ్, అరవిందఘోష్, బిపిన్ చంద్రపాల్ మొదలైన వారు అట్టి మార్గమును సూరత్ కాంగ్రెసు (1907)లో నిరసించిరి.

తరువాతి పది సంవత్సరములకు 1916 లో - అప్పటికి ప్రథమ ప్రపంచసంగ్రామము రెండేండ్లు గడచినది - లక్నో కాంగ్రెస్ సమావేశ మున హోమ్‌రూలు ఉద్యమమునకు అనీ బిసెంటు విఘ్నేశ్వరపూజ చేసినది. విఠల్ భాయ్ పటేలు తిలక్ ననుసరించి ఆయుద్యమమున జేరెను.

హోమ్‌రూలు ఉద్యమచరిత్ర ఇక్కడ విపులీకరింప బనిలేదు. డా॥ సుబ్రహ్మణ్య అయ్యర్, కే. వి. రంగస్వామి అయ్యంగారు, సి. పి. రామస్వామి అయ్యర్ మొదలగు ఉత్సాహశూరు లీయుద్యమమునకు పట్టుకొమ్మలైరి. బిసెంటుకూడ ప్రభుత్వపు ఆగ్రహమునకు గురియయ్యెను. దానితో ఈ యుద్యమమునకు మరింత బలముచేకూరినది.

**స్పెషల్ కాంగ్రెసు అధ్యక్షత**

1918 లో అఖిలభారత కాంగ్రెసు ప్రత్యేకసమావేశము బొంబాయిలో జరిగెను. విఠలుభాయి పటేలు ఆహ్వాన సంఘాధ్యక్షుడుగ ఎన్నుకోబడెను. ఈ ప్రత్యేక సమావేశము మాంటేగ్, చమ్స్‌ఫర్డు నివేదికను సమీక్షించుటకు ఉద్దేశింపబడినది. అప్పు డాతడిచ్చిన యుపన్యాసము అతని దూరదృష్టికిని, ప్రజ్ఞా విశేషములకును, ఒక చక్కని తార్కాణము. క్రమశః కాంగ్రెసు రాజకీయములలో పటేలు నకు పలుకుబడి లభించెను. ఆసంవత్సరమే ఆతడు కాంగ్రెసు కార్యదర్శి పదవి నలంకరించెను. కాంగ్రెసు కార్యదర్శిగా నున్నప్పుడే యతడు భారతసంస్కరణల విషయమై జాయంటు పార్లమెంటరీ కమిటీముందు

కాంగ్రెసుతరఫున సాక్ష్యమిచ్చుటకై లండన్ వెళ్ళినాడు. 'భారతీయులకు స్వపరిపాలనము కావలె' నన్న కాంగ్రెసుకోరికను పటేలు లండన్‌లో సమర్థించెను — స్వపరిపాలనా బాధ్యతలు నిర్వహించుకొనగల అర్హత భారతీయులకు కలదు ... అని యాతడు నొక్కి వక్కాణించెను. మాంటేగ్ - ఛమ్సుఫర్డు సంస్కరణలు భారతీయుల వాంఛలకు అనుగుణ ముగ లేవని వాదించెను.

రెండవతూరి విఠల్‌భాయ్ లండన్ వెళ్ళినది అచ్చట జాయంటు పార్లమెంటరీ కమిటీకి మాంటేగ్-ఛమ్సుఫర్డు సంస్కరణల విషయమై కాంగ్రెసు అభ్యర్థిగా కాంగ్రెసు అభిప్రాయములను తెలియజేయుటకు అతనితోకూడ మరికొందరు కాంగ్రెసు అభ్యర్థులుకూడా వెళ్ళినారు. ఈ యదనున అతడు ఆంగ్లేయులకు భారతీయుల ఆశయములను బాగుగ ఎరుకపరచి వచ్చినాడు. విఠల్‌భాయ్ తాను ఇంగ్లండులో కావించిన కృషినిగూర్చి ఇట్లు చెప్పెను—

"మరల అమృతసర్ కాంగ్రెసు సమావేశమునకు వచ్చివేయవలె నను తలంపుతో మేము 1919 నవంబరులో ఇంగ్లండునకు బయలుదేరివెళ్ళి నాము. మాంటేగ్ - ఛమ్సుఫర్డు బిల్లును గూర్చి కాంగ్రెసు అభిప్రాయము లను జాయంటు పార్లమెంటు కమిటీకిని, కామన్సు సభవారికిని పూర్తిగా యెరుకపరచి వచ్చుటయే నా కార్యక్రమము. మాయెడ అత్యంత సాను భూతి ప్రకటించినవాడు ఆ కమిటీలో స్పూర్ అను సభ్యుడు ఒక్కడే. నేను ఆయనతో గంటల తరబడి సంప్రదించినాను. కాంగ్రెసు ఆశయ ములు, భారతప్రజల కోర్కెలు న్యాయబద్ధములని నేనాయనకు నచ్చజె ప్పినాను. నేను ఢిల్లీ కాంగ్రెసు తీర్మానముల ననుసరించి తయారు చేసిన తీర్మానము లన్నిటిని కమిటీలో ప్రవేశపెట్టింతునని యాతడు వాగ్దానము చేసెను. కాని ఒక్కని పలుకుబడివల్ల యేమగును? జాయంటు కమిటీ 'రివైజు' చేసిన బిల్లు కామన్సుసభలో చర్చకు వచ్చినప్పుడు నా ఎమెండుమెంటులను అక్కడకూడ ప్రవేశపెట్టెదనని యాతడు మాట యిచ్చెను. అందుకుగాను నన్ను వెళ్ళి తనపార్టీ సభ్యులను కొందరిని ప్రముఖవ్యక్తులను కలసికొని మాటాడి రమ్మని సలహా చెప్పినాడు. నేనట్లే చేసితిని. లేబర్‌పార్టీ సభ్యులందరకు కాంగ్రెసు దృక్పథమును వ్యక్తముచేసి, చాలమందిని ఒప్పించగలిగినాను. నా ఎమెండుమెంటులను ప్రతులు వ్రాయించి లేబరు పార్టీ సంభ్యులందరకు అందజేయించితిని. లేబరు పార్టీవారు సమావేశమై యీ ఎమెండుమెంటులను చర్చింపవలసి

దినగ అన్ని యేర్పాట్లు చేసినాను. కాని ఇట్టి తరుణమున విచారణీయ మగు సంఘటనము ఒకటి అడ్డువచ్చినది. జాయింటు కమిటీ రివైజు చేసిన బిల్లునే కామన్సుసభ ఆమోదింపవలెననియు, ఎట్టి ఎమెండుమెంటులను లెక్క చేయరాదనియు బెసెంటు ప్రచారము సాగించెను. ఏది యెట్లయినను లేబరుపార్టీ కార్యవర్గము నాదృక్పథము నంగీకరించి, నా ఎమెండు మెంటులను పార్లమెంటులో ప్రవేశపెట్టుటకే నిర్ణయించెను.

"అంతటితో ఊరుకొనక నేను ఇతర పార్టీసభ్యులను గూడ కలసి కొంటిని. నాలుగుసార్లు వెళ్ళి కలుసుకొని మార్ అలమ్‌స్కాట్ సహకారమును సైతము సంపాదించితిని. బొంబాయిలో లా-పోలీసు శాఖలు తప్ప మిగిలిన వాటిని ప్రజాయత్తము చేయవలసినదను ఎమెండుమెంటును ప్రవేశపెట్టుట కాతడంగీకరించెను.

"బిల్లు కామన్సు సభలో మూడురోజులు చర్చకు వచ్చెను. నాకుగూడ 'గ్యాలరీ' లో సీటుదొరకినది, అందువల్ల నా ఎమెండుమెంటులను ప్రవేశపెట్టుచున్న సభ్యులకు అవసరమైనప్పుడెల్ల ఉచితములగు సలహాల నిచ్చుటకు వీలైనది. చర్చలను ఆమూలాగ్రముగ వినగలిగితిని.

"నా ఎమెండుమెంటులలో ఒక్కటికూడ నెగ్గలేదు. ఐనను చర్చల మూలమున అనేక విషయములు బైటికి వచ్చినవి. భారతీయుల న్యాయబద్ధమైన వాంఛలకు ప్రచారము కలిగినది.

"తిరిగి స్వదేశమునకు వచ్చుముందు మరల నొకసారి లేబరుపార్టీ సభ్యులందరను దర్శించినాను. స్వపరిపాలనము వాంఛించుచున్న భారతీయుల కోర్కెపట్ల వారి సానుభూతిని అధికార ప్రకటన రూపమున వెల్లడింపుడని కోరినాను. తత్ఫలితముగ 1919 డిశంబరు 18 న కామన్సు సభలో మన్ముల్లను సాగనంపు సందర్భమున జరిగిన విందులో హెండర్సన్ ఒక ప్రకటన చేసినాడు. దానిని బ్రిటిష్ లేబరుపార్టీ ఆమోదించినది."

**తిలక్ మహనీయుని రాజకీయములలో**

కాంగ్రెసు కార్యదర్శిగనుండి, రెండు పర్యాయములు ఇంగ్లండు వెళ్ళి కాంగ్రెసు ఆశయప్రచారమునకు విఠల్‌భాయ్ కావించిన కృషికి దేశీయులందరు హర్షించి జయవెట్టినారు. సమయము దొరకెనా ఆతడు బ్రిటిషు సామ్రాజ్య తత్వమును నిశితముగ విమర్శించుచుండెడివాడు.

ఇండియాలో బ్రిటిష్ పరిపాలనావిధానము మారవలెనని అతని యాశయము. బ్రిటిష్‌పాలనము మంచిదికానీ, చెడ్డదికానీ — ఆ విషయ మనవసరము. పరిపాలనా చక్రము భారతీయుల హస్తగతము కావలసి నదే. స్వపరిపాలనము వారి జన్మహక్కు — అని పటేలు వాదము. మాంటుఫర్డు సంస్కరణలలో అట్టి స్వపరిపాలనము దేశీయులకు బీజ మాత్రముగనైన లేనందు కాతడు ఎంతయు ఆగ్రహించెను. ఈమాంటుఫర్డు సంస్కరణలను సురేంద్రనాథ బెనర్జీ ప్రోత్సాహముతో సుప్రీం కౌన్సిల్ అభినందించినప్పుడు విఠల్ భాయ్ ఒక్కడే ధైర్యముగా తిరస్కరించినాడు.

అప్పటికి జాతీయవాదులలో అతివాదులు తీవ్రవాదులు అను రెండు తెగలు ఏర్పడినారు. విఠల్ భాయ్‌పటేలు చాలవరకు అతివాదులతో ఏకీభవించుచుండెను. అనేక సందర్భములలో తిలక్‌ను అనుసరించుచుండెను. లోకమాన్యుని కడ వల్లభాయికి హృదయపూర్వకములైన ఆదరప్రోత్సాహములు లభించెను. త్వరలోనే ఇద్దరును మంచి సన్నిహితులైనారు.

**సహాయ నిరాకరణోద్యమము**

భారతచరిత్రలో 1919 వ సంవత్సరము చిరస్థాయి. అప్పుడే రౌలట్‌చట్టము వచ్చినది. "ఈచట్టము బ్రిటిష్‌పాలకులలో వేళ్ళు పాతుకొనియున్న ఒకానొక వ్యాధికి లక్షణము" అన్నాడు గాంధిజీ. కౌన్సిలు సభ్యులు ప్రతిఘటించినారు; దేశమంతట ప్రజలు ప్రతిఘటించినారు. అయినను చట్టము వచ్చి తీరినది.

ఆ సంవత్సరమే 'రిఫారమ్స్ అక్టు' కూడ వచ్చినది. అది కేవలము స్వపరిపాలనము కోరుచున్నవారి కన్నీళ్ళు తుడుచుటకు ఉద్దేశించినదే.

ఆ సంవత్సరమే పంజాబు దురంతములు సాగినవి. రాయల్ విచారణ సంఘము నొకదానిని నియమింపవలెనని ప్రజలు ఆందోళనము సలిపిరి. కాని బ్రిటిష్‌ప్రభుత్వ మట్టి పని యేదియు చేయలేదు. ఇండియా ప్రభుత్వమే...తానే నేరస్థురాలై యుండి...హంటర్ ప్రభువు అధ్యక్షుడుగా ఒక విచారణ సంఘమును ఏర్పరచెను. ఈ కమిటీ యెదుట వచ్చి సాక్ష్యము చెప్పుటకు నాయకులను పంజాబు ప్రభుత్వము జైళ్ళనుండి విడుదలచేయదయ్యెను. కాగా కాంగ్రెసే మహాత్మ గాంధి మొదలగు లాయర్లను ఒక విచారణ సంఘముగా నేర్పరచినది. ఈ పరిస్థితులన్నియు సహాయనిరాకరణోద్యమమునకు దారి తీసినవి.

రౌలట్ చట్టమును ప్రతిఘటించుటకై గాంధిజీ లేవదీసిన సత్యాగ్రహోద్యమము నుండియే సహాయ నిరాకరణోద్యమము ఉద్భవించినదని చెప్పవచ్చును.

అప్పటికి పటేల్ను, అతని అనుయాయులును బాలగంగాధర తిలక్ ననుసరించి మరియొక కార్యక్రమమును నిర్ణయించుకొని యుండిరి. కాని విఠల్ భాయ్ పటేల్ నూటికి నూరుపాళ్ళు కాంగ్రెసు భక్తుడు. పైగా గాంధిజీ వ్యక్తిత్వమును, అతని శక్తులను, అతడు కాంగ్రెసులో తెచ్చిన నూతన చైతన్యమును పటేల్ గుర్తించెను. ఉప్పెనవలె వచ్చుచున్న ఈ క్రొత్త యుద్యమమును వ్యతిరేకించుట నిష్ఫలమని యాతడు గమనించెను. 1920 కలకత్తా కాంగ్రెసులో అధిక సంఖ్యాకు లామోదించిన సహాయ నిరాకరణోద్యమ తీర్మానమునకు తానుకూడా కట్టుబడి, అదే సంవత్సరము ఆఖరువరకు కాంగ్రెసు కార్యదర్శిగ వ్యవహరించెను. అతరు వాత ఆ పదవి మోతీలాల్ పండితునికి సంక్రమించినది.

విఠల్ భాయ్ మొదటినుండియు కార్యవాది. ఒక్కసారిగా ఆదర్శ పూరితమైన గాంధీజీ సిద్ధాంతమును స్వీకరించినవాడు కాడు. గాంధీతత్వమును ఈతడు చాలపర్యాయములు విమర్శించెను. కాని క్రమేణ గాంధిజీ ప్రభావము ఈతనిపై ప్రసరించినది. గాంధీ - ఇర్విన్ ఒడంబడిక గాంధిజీ వేసిన తప్పటడుగులో ఒకటియని విఠల్ భాయ్ ఉద్దేశము. పూనా సమావేశము రాజకీయముగ గాంధీజీ ఓటమిని సూచించుచున్నదని యాతడనెను. కాని దేశబంధు చిత్తరంజన్ దాసు - మోతీలాలు - మొదలగు ప్రముఖులవలె ... గాంధిజీ ఒక్కడే ప్రజాసామాన్యమును మేలుకొలిపి, స్వరాజ్యము తమ జన్మహక్కు అని గుర్తింప జేయగలవాడు ... అని విఠల్ భాయికూడా విశ్వసించెను. కనుకనే ముందువెనుకలు ఆలోచింపనుండ అతడు ... గాంధీజీ నాయకత్వమున లేచిన సహాయ నిరాకరణోద్యమములో నడుముబిగించి దుమికినాడు. ఎంత త్యాగమునకైనను వెను దీయలేదు. ఉద్యమమును జయప్రదముగ కొనసాగించుటలో సర్వవిధముల తోడుపడెను.

ఈ యుద్యమముయొక్క చరిత్రయంతయు ఇచ్చట ఎవరింప నవసరము కాదు. రౌలట్ చట్టమునకు ప్రతిఘటనముగా గాంధిజీ ప్రతిపాదించిన సత్యాగ్రహోద్యమము... 1920 సెప్టెంబరు కలకత్తా ప్రత్యేకసమావేశములో, లాలా లజపత్ రాయి అధ్యక్షతను... కాంగ్రెసు అంగీకారముపొందబడసినది.

(1) బిరుదులను, గౌరవపదవులను త్యజించుట (2) గవర్న మెంటు ఆఫీసులను, దర్బారులను బహిష్కరించుట (3) గవర్న మెంటు వారు నడుపుచున్న స్కూల్లు-కాలేజీలను విద్యార్థులు బహిష్కరించి, జాతీయ విద్యాలయాలను స్థాపించుకొనుట-ఈ విధముగా ఒక కార్యక్రమమును రచించుకొన్నారు. శాసన సభలుకూడ బహిష్కృతములైనవి. విదేశ వస్తుబహిష్కరణము కూడ ఈ కార్యక్రమములో ప్రధాన అంశము. గవర్న మెంటు కోర్టులను, ఉద్యోగములనుకూడ బహిష్కరించుటను ఈ ఉద్యమను ప్రోత్సహించినట్లే.

బిపిన్ చంద్రపాల్ ప్రతిపాదించిన ఎమెండు మెంటు వీగిపోయినది. అసలు తీర్మానమును నెగ్గించుటకైనను గాంధీజీ ఎంతయో ప్రతిఘటనను ఎదురుకోవలసి వచ్చినది. కాని పరిస్థితులాయనను బాగుగ అనుకూలించినవి. పంజాబు-కిలాఫత్ దురంతములు ప్రజల హృదయాలలో కంటకములై నాటుకొనియుండెను. ప్రభుత్వము కొత్తగా ప్రవేశపెట్టిన సంస్కరణాలు వారి కోరికలకేమాత్ర మనుగుణ్యముగాలేవు. కాగా వారికి గాంధీజీ విధానము చక్కగా నచ్చినది.

అప్పుడిక దేశములో ఎన్నికలు జరుగవలసియుండెను. చాలమంది కాంగ్రెసు అభ్యర్థులు నామినేషనులు దాఖలు చేసుకొనియుండిరి. దేశబంధుదాస్, మోతీలాలు నెహ్రూ, విఠల్‌భాయి మొదలగు వారు శాసనసభా బహిష్కారమునను పూర్తిగా వ్యతిరేకించినారు. కాని తుట్టతుదకు వారు ప్రజాభిప్రాయమునను తలలొగ్గవలసిన వారైరి. తదుపరి డిశంబరులో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సమావేశములో ఈ సత్యాగ్రహోద్యమ తీర్మానము పునరామోదింపబడెను. ఈ సమయముననే పటేలు తన కాంగ్రెసు కార్యదర్శి పదవినుండి విరమించెను. కాంగ్రెసు కార్యదర్శిగా ఇండియా - ఇంగ్లండులలో పటేలు కావించిన కృషికి కాంగ్రెసు సభ తన కృతజ్ఞతను వెలిబుచ్చినది. విఠల్‌భాయి పటేలు పేరు ఉచ్చరితమైనప్పుడెల్ల సభయంతయు కరతాళధ్వనులతో హర్షపులకిత మయ్యెడిది.

**కాంగ్రెసు జీవగర్ర పటేలు**

మహాత్ముని నాయకత్వమున సహాయ నిరాకరణోద్యమము దావాగ్నివలె వ్యాపించి పోయినది. జాతీయశక్తులలో అతఃపూర్వముండిన కుళ్ళు ఆ మహాగ్నియందు భస్మీపటల మయ్యెను. జాతీయోద్యమము పరిశుద్ధమై బాహిరిల్లెను.

మితవాదులు, ధనికవాదులు మింటో - మార్లే సంస్కరణలను అభినందించినారు. జాన్ బ్రైట్ చెప్పినట్లు "ధనికవాదులు రాజకీయముగ పిరికివారు." వీరి పిరికితనము కొంతవరకు కాంగ్రెసులో ప్రవేశించి యుండెను మార్లే ప్రభువు మితవాదుల భుజములు తట్టి చేరదీసు కొనెను. ఆనాడు ముఖ్యముగ మితవాదుల ప్రాబల్యముగల కాంగ్రెసు కూడ కొంతవరకు పిరికిపాలు త్రాగిన మాట వాస్తవమే. కాని సహాయ నిరాకరణముతో ఈ పిరికిపాలు ఇగిరి పోయినవి. అతివాదులు ఇంకా ఇతరములైన హక్కులను సంపాదింప కృతనిశ్చయులై ఉన్నారు. తరువాత అహమ్మదాబాదు కాంగ్రెసు జరుగవలసియుండెను. దానికి దేశబంధు చిత్తరంజనదాసు అధ్యక్షుడుగా ఎన్నుకోబడెను. ఆతడు ప్రభుత్వము నిషేధించిన ఒక వాలంటీరు దళములో సభ్యుడై యుండెను. అందుచే ప్రభుత్వ మాతనిని కారాగారమున బంధించినది. కాంగ్రెసు కార్యక్రమముకూడా పోరాటమే. ప్రభుత్వము ప్రజలయెడ బాధ్యత వహించినది కాదు. ప్రస్తుత పరిపాలనము అంతరించవలెను. అందుచే అహమ్మదాబాదు కాంగ్రెసులో శాసనోల్లంఘనము ప్రతిపాదితమయ్యెను. కాని ప్రజలు అహింసా నిరోధము నందు పూర్తిగ తర్ఫీదు పొందిన తరువాతనే శాసనోల్లంఘనమును పూనవలెనని కాంగ్రెసు తీర్మానించినది. గాంధీ రాజకీయములలో ఎన్నడును అహింసకు తావులేదు. ఎవరైన హింసాకృత్యములు చేసినపుడెల్ల గాంధీజీ విమర్శించుచునే యుండెను; విచారమును వెలిబుచ్చుచునే యుండెను. ఆపాపపరిహారము నకు ఉపవాసాది వ్రతములు పూనుచునే యుండెను.

పటేలు జన్మతఃవీరుడు; యుద్ధమంటే మక్కువ. అహమ్మదాబాదు కాంగ్రెసు చాలభాగము ఆతని భుజస్కంధాల మీదనే సాగిపోయినది. శాసనోల్లంఘన తీర్మానమును ఆతడు బలపరచెను. 'భారతీయులు కత్తితోనో, ప్రసాదముగానో స్వరాజ్యమును తప్పక సాధింపగలర' నియాతడు నొక్కి వక్కాణించెను,

"శాసనోల్లంఘన తీర్మానమును మీరు అమలుజరుపు పక్షములో... భగవంతుడు సాక్షిగా మీరు జైళ్ళకుపోవుటకు, దేశముకోసము ప్రాణత్యాగమైన చేయుటకు సంసిద్ధులుకావలెను. ఈపోరాటము అహింసా పద్ధతిని, శాంతముగా, ఉత్సాహవంతముగా సాగవలె ... ఇతరులను మీరు హింసింపరాదు; శారీరక - మానసికహింసలు వర్జ్యములు" అని

విఠలుభాయ్ ఉపన్యసించెను. ఈమాటలు అహింసలో అతనికిగల విశ్వాసమును చాటుచున్నవి.

ఇండియాలో నూతన సంస్కరణలు ప్రవేశపెట్టు సందర్భమున అయిదవజార్జి సార్వభౌముడు భారతీయులకొక సందేశము పంపినాడు.— "దేశభక్తులు, రాజభక్తులు నగు భారతీయులు స్వరాజ్య స్వప్నమును దర్శించుచున్నారు. ఈ క్రొత్త సంస్కరణల మూలమున భారత స్వరాజ్య బీజములు ప్రతిష్ఠితము లౌతున్నవి. నా సామ్రాజ్యములో ఇతర దేశములవలె భారతదేశమును స్వాతంత్ర్య మార్గమున పురోభివృద్ధి నందుటకు అవకాశములు కల్పితము లౌతున్నవి." అని.

విఠల్‌భాయ్ తన యుపన్యాసధోరణిలో యీవాక్యములు ఉదహరించి భారతీయుల స్వరాజ్యవాంఛను బలపరచెను. కాని చక్రవర్తి ఏ అయిదు - పది - పదిహేను సంవత్సరములలోనో భారతీయులకు స్వరాజ్యము ప్రసాదించెదమని ప్రకటింపకపోవుట నిరాశావహముగ నున్నదనెను. అయినను కాలపరిమితి ప్రజల వాంఛాబలముపై ఆధారపడి యున్నదనికూడ యాతడనెను.

ఈ యుపన్యాసము ప్రజలను ఎంతయు ఉత్తేజితులను చేసినది. ప్రజాసామాన్యములో నూతనోత్సాహపు వెల్లువలను రేకెత్తించినది. మహాత్ముడు కార్యక్రమమును బోధించెను; విఠల్‌భాయ్ ప్రజలలో ఉత్సాహోల్లాసములను పెంపొందించెను.

**శాసనోల్లంఘన విచారణ సంఘము**

1922 జూన్ 6 వ తేదీని అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గము శాసనోల్లంఘన కార్యక్రమముగూర్చి దీర్ఘముగ విచారించి, అందుకు దేశము సంసిద్ధమై యున్నదో లేదో గమనించుటకై ఒక విచారణసంఘమును నియమించెను.

విఠల్‌భాయ్ పటేల్ ఆసంఘములో ఒక ప్రముఖసభ్యుడు. భారతదేశమంతయు నాతడప్పుడు పర్యటించెను. తన బుద్ధిబలమంతయు ఆసమస్యకై వినియోగించినాడు. సామూహిక శాసనోల్లంఘమునకు (Civil Disobedience) దేశము సంసిద్ధముగ లేదనియే ఈ విచారణ సంఘము నిర్ణయించినది. శాసనసభా ప్రవేశసమస్య మరల చర్చకువచ్చినది. డా॥ అన్సారీ, శ్రీయుత సి. రాజగోపాలాచారి, యస్. కస్తూరి రంగ అయ్యంగారు మొదలగు వారు శాసనసభా బహిష్కారమునే బలపరచి

నారు. కాని విఠల్ భాయ్, మోతీలాలు, హకీమ్‌సాహెబు మొదలగు వారు శాసనసభలలో ప్రవేశింపవలెననియే తీవ్రముగ వాదించిరి. "పంజాబ్ - కిలాఫత్ సంఘటనలలో ప్రజలకు జరిగిన అన్యాయములను శాసనసభలు చక్కబరుపలేక పోయినవి. ప్రజలు కష్టాలపాలైయున్నారు. కాబట్టి జాతీయవాదులు ప్రస్తుతపరిస్థితిలో, ప్రజాక్షేమమును వాంఛించి శాసనసభలలో ప్రవేశింపవలసిన యవసరమెంతయైన నున్నది." అని విఠల్ భాయ్ వాదన, తత్ఫలితముగా ఈక్రింది తీర్మానములు ఆమోదింపబడినవి—

1. కాంగ్రెసు వారు ఎన్నికలలో పాల్గొని అధికసంఖ్యాకులుగ శాసనసభలలో ప్రవేశించుటకు కృషి చేయవలెను. కిలాఫత్ - పంజాబ్ సంఘటనలలో ప్రజలకు జరిగిన అన్యాయములను సరిదిద్దుట, స్వరాజ్య సంపాదనము వారి లక్ష్యములై యుండవలెను.

2. 'కోరమ్'కు మించి అధికసంఖ్యాకులుగ జాతీయవాదులు శాసనసభా ప్రవేశము చేయగలిగినచో వారు తమ పదవులను స్వీకరించి వెంటనే బయటికి వచ్చివేయవలెను.

3 కోరమ్‌కు మించిన అధికసంఖ్యాకులుగ జాతీయవాదులు శాసన సభా ప్రవేశము చేయగలిగినచో వారు ప్రభుత్వపు బిల్లులను ప్రతిఘటించుటయే పనిగా పెట్టుకొనవలెను; (1) లో చెప్పిన లక్ష్యములను సాధించు తీర్మానములను ప్రవేశపెట్టుచుండవలెను.

4. జాతీయవాదులు అల్పసంఖ్యాకులుగనే శాసన సభాప్రవేశము చేసితేని, వారు (2) లో చెప్పిన రీతిగా ప్రవర్తింపవలసి యుండును.

శాసనోల్లంఘన విచారణ సంఘంలో విఠల్ భాయ్ సభ్యుడుగా నుండి సాధింపగలిగిన తీర్మానము లవి.

**స్వరాజ్య పార్టీ** శాసనసభా ప్రవేశమును గూర్చిన అభిప్రాయ భేదములు 1922 గయా కాంగ్రెసు సమావేశములో మరింత తీవ్రముగ వ్యక్తములయ్యెను. ఆ సమావేశము దేశబంధు చిత్తరంజన్‌దాసు అధ్యక్షతను జరిగినది. తన అధ్యక్షోపన్యాసమునం దాతడు శాసన సభాప్రవేశమును సమర్థించెను. కాని యా తీర్మానమును కాంగ్రెసు త్రోసివైచెను. వెంటనే దేశబంధు దాసు తన యధ్యక్షపదవికి రాజీనామా యిచ్చెను. కాని కాంగ్రెసు

దానిని అంగీకరింపలేదు. అందుచేత కాంగ్రెసు అధ్యక్షుడుగ వ్యవహరించుచునే దేశబంధుదాసు "కాంగ్రెసు - కిలాఫత్ - స్వరాజ్య పార్టీ" అనుదానిని లేవదీసెను. శాసనసభా ప్రవేశమునకు సుముఖులై యుండిన వారందరు అందు చేరినారు.

ఈ స్వరాజ్య పార్టీ కాంగ్రెసుతో తెగ్రతెంపులు చేసుకొన్నది కాదు. కాంగ్రెసును తన లక్ష్యమునకు అనుగుణ్యముగ మార్చుకొనుటకై ఉద్దేశింపబడినది.

నెలల తరబడి స్వరాజ్యపార్టీవారు దేశములో సంచారముచేసి తమ యాశయములను తీవ్రముగ ప్రచారము చేసుకొన్నారు. తరువాత ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు ప్రత్యేక సమావేశములో శాసన సభా ప్రవేశము అంగీకృతమయ్యెను. ఈ విజయముతో స్వరాజ్యపార్టీకి అప్పటిలో ఎక్కడలేని ప్రాముఖ్యమువచ్చినది. ప్రజలసానుభూతి సహకారములు లభించినవి. స్వరాజ్యపార్టీవారు శాసన సభలలో అధిక సంఖ్యాకులుగ ప్రవేశింప గలిగినారు.

స్వరాజ్యపార్టీ చరిత్రలో విఠల్‌భాయ్‌పాత్ర అతి ప్రముఖమైనది. మోతీలాల్, చిత్తరంజనదాసుల ప్రాభవమున విఠల్‌భాయ్ స్వరాజ్యపార్టీ అభ్యుదయమునకు మేలు స్తంభమై నిల్చెను. ఆరు సంవత్సరములు ఈ పార్టీ కార్యక్రమము జేగీయమానముగ సాగినది.

విఠల్‌భాయ్ కేంద్రశాసన సభలో అడుగుపెట్టినాడు. ఆతడు మడమ త్రిప్పని యోధపుంగవుడు. స్వరాజ్యపార్టీలోనికి మితవాదిత్వమును రానిచ్చినాడు కాదు. అసెంబ్లీలో పటేల్ సాధించిన విజయము లనంతములు. అనేకసార్లు ప్రభుత్వపు ఫైనాన్సుబిల్లులు, ఆదాయ వ్యయపట్టికలు త్రోసివేయబడినవి. తత్ఫలితముగా ప్రభుత్వము చిట్టచివరకు జాతీయవాదుల వాంఛలను గమనింపక తప్పలేదు.

**నాగపూర్ పతాక సంఘటనము**

పటేలు రాజకీయ జీవితమునకు నాగపూర్ పతాకసంఘటనము చెరుగని వన్నెదిద్దినది. 1923 ఏప్రియల్ 13 న జబల్పూరులో జిలియన్‌వాలా సాంవత్సరికము జరిపినారు. కాంగ్రెసు యువకులు మునిసిపలు భవనముపై నెక్కి జాతీయపతాకము ప్రతిష్ఠించినారు. పోలీసులు వచ్చి దానిని లాగివేసి, చించి, త్రొక్కి చెండాడినారు. ఒక యూరపియన్ డిప్యూటీ కమీషనరు అప్పుడు ముని

సిపలు అధ్యక్షుడుగా నుండెను. ఆతడీ సందర్భమున చాల నింద్యముగా ప్రవర్తించెను. వెంటనే కవున్సిలర్లందరును రాజీనామా లిచ్చిరి. జిల్లా కాంగ్రెసు సంఘము సత్యాగ్రహ మారంభించెరు.

యువకులు జట్లుజట్లుగా వచ్చి జాతీయపతాకమును మునిసిపలు భవనముపై ప్రతిష్ఠించుటయు, పోలీసులు వచ్చి లాగివేయుచుండుటయు, ఆవాలంటీరులను ఖైదుచేయుటయు జరుగుచుండెను.

ఈ సంఘటనలే వెన్మ్మదిగ నాగపూరునకు కూడ ప్రాకి వచ్చినవి. రాష్ట్రీయకాంగ్రెసు కమిటీ జోక్యము కలిగించుకొనెను. ఒక సత్యాగ్రహశిబిరమును తెరచినారు; నిధిని ప్రోగుచేసినారు; వాలంటీర్లు తండోపతండముగ ఏకత్రితమైనారు. లాటీచార్జీలు, కారాగారశిక్షలు - మామూలు ప్రభుత్వపు దమననీతి కరాళనృత్య మారంభించినది. జాతీయ పతాకగౌరవమును కాపాడుకొను నిమిత్తము ప్రజలు ప్రాణములు తెగించి వచ్చినారు.

జమనాలాల్ బజాజ్ నాయకత్వమున వాలంటీర్ల దళము జాతీయ జండాలు పుచ్చుకొని సత్యాగ్రహ మారంభించిరి. పోలీసులు వచ్చి ఊరేగింపును నిలిపిరి. డిస్ట్రిక్టు మేజస్ట్రీటు 144 వ సెక్షన్ను ప్రకటించెను. అనుమతి లేకుండ ఇట్టి ఊరేగింపులుగాని, సమావేశములుగాని పట్నములో జరుపరాదని శాసించెను. ప్రజాశాంతికి భంగకరమైన పరిస్థితిలో తప్ప, ...క్రిమినల్ నేరముగా పరిణమించినప్పుడే తప్ప...జాతీయ పతాక ప్రతిష్ఠా సందర్భములలో జోక్యము కలుగజేసుకొనకుండుటయే అప్పటి మధ్య పరగణాల ప్రభుత్వమువారి విధానము. అయినను...ఈసత్యాగ్రహ విధానము 'యూనియన్ జాక్' నకు అగౌరవప్రదమనియు, రాజభక్తి పరుల కది కష్టముగా నున్నదనియు మేజస్ట్రీటు తన ప్రవర్తనమును సమర్థించుకొనెను.

జమనాలాల్ బజాజుని ఎరెస్టు జేయుటతో ఉద్యమము తీవ్రతర రూపము తాల్చినది. పదేసిమంది వాలంటీరులు జాతీయ జండాలను పుచ్చుకొని బయలుదేరెడివారు. మేజస్ట్రీటు ఎదురువచ్చి శ్రీ ముఖాలు అందించి జైళ్ళకు తీసుకొని పోయెడివాడు. గుంపులు గుంపులుగా చూడవచ్చిన ప్రజల కరతాళధ్వనులు మిన్నుముట్టెడివి. ఒకరోజు కాదు, రెండు రోజులు కాదు - నాలుగు మాసముల వరకు ఇదే వరుస. మొత్తము వెయ్యిమందికి పైగా వాలంటీర్లు జైళ్ళ నలంకరించిరి.

ఆసమయమున అఖిలభారత కాంగ్రెసుకమిటీ నాగపూర్‌లో సమావేశమయ్యెను. జూలై 18 వ తేదీ పతాకదినముగా నిర్ణీతమయ్యెను. ఆనాడు దేశమంతట పతాకోత్సవాలు, ఊరేగింపులు జరిగింపవలసినదిగా రాష్ట్రకాంగ్రెసు సంఘాలకు తాఖీదులు వెళ్ళినవి.

తదాజ్ఞానుసారము అన్నిపట్నాలలోను పతాకోత్సవము విజయోపేతముగ సాగినది. ప్రభుత్వాధికారులు కిమ్మనలేదు. అనవసరముగా జోక్యము కలిగించుకొన్నట్లాయెనా దేశమంతయు ఎదురుతిరిగియుండెడిది.

ఈవిధముగ నాగపూర్ పతాకసంఘటనము అఖిల భారతోద్యమముగా పరిణమించినది. ప్రభుత్వోద్యోగులు వెనుకముందు లాలోచించుకొనసాగిరి. ఈయుద్యమ ప్రధానసంచాలకులైన పటేల్ సోదరులు పలుమారులు గవర్నరుతో సంభాషించిరి. చివరకొక సమాధానము కుదిరినది. ఇందు నైతికముగా ప్రజలకే విజయముచేకూరినదని వేరుగ చెప్పనవసరములేదు.

విఠల్ భాయ్ పట్టువీడని యోధుడే అయినను అవసరమైనప్పుడు సమరసముగా పరిష్కారమార్గమును అవలంబించుటకు వెనుకాడడు.

---

# 4

# అసెంబ్లీ స్పీకరు

ఇప్పుడు మనము విఠల్ భాయ్ జీవితచరిత్రలో ప్రధాన ఘట్టమున ప్రవేశించుచున్నాము. భారత కేంద్రశాసన సభాధ్యక్షుడుగనుండి యాతడు ప్రదర్శించిన ప్రతిభా విశేషములు, మేధాసంపత్తి, ప్రజ్ఞాసామర్థ్యములు అనన్య సామాన్యములైనవి. ప్రత్యర్థిశక్తులపై యాతడార్జించిన విజయము లనంతములు. ఎన్నియో ఆటంకములు సంభవించెను, కిట్టనివారు ఆతనిగూర్చి దుష్ప్రచారము సాగించిరి. అయినను విఠల్ భాయ్ తొణకలేదు, బెణకలేదు. తన విధ్యుక్త విధులను ప్రశాంతముగ నిర్వర్తించుకొనగలిగెను. మరొకడైనచో కుప్పలుకూలిపోయి యుండెడివాడు. అసెంబ్లీ అధ్యక్షుడుగ ఆతని చరిత్ర భావిభారత గాథలో స్వర్ణాక్షరాల లిఖితము కాగలదు. అసెంబ్లీలో ఆయన పలికిన పలుకులు, చేసినచేతలు భావిభారత రాజ్యాంగ సంచాలకులకు ఆదర్శప్రాయములు. భారత కేంద్రశాసన సభకు పార్లమెంటునకున్నంత గౌరవమును చేకూర్చి పెట్టినవాడు విఠల్ భాయ్ పటేల్. అనధికార వర్గమునుండి అతడే ప్రప్రథమముగా శాసన సభాధ్యక్షుడుగ ఎన్నుకోబడినవాడు.

అసెంబ్లీ అధ్యక్షపదవి నలంకరించినంతనే విఠల్ భాయ్ అంతశ్శక్తులన్నియు వికసించి సౌరభమును విరజిమ్మినవి. ఆతడు శాసన సభా గౌరవమును పెంపొందించినాడు. ఆ ఠీవి, ఆరాజసము ఆయనకే తగిపోయినది. అంతకు పూర్వము కన్న విఠలుభాయ్ ఆధిపత్యమున శాసన సభాధికారములు విస్తృతములయ్యెను. పార్లమెంటరీ విధానమందు నమ్మకమున్నవారందరు ఆతనిని మిక్కిలి గౌరవించి తీరుదురు. సామర్థ్యముతో, నిష్పాక్షికముగా నాతడు తన అధ్యక్షవిధులను పాటించి ప్రతిభాశాలి యనిపించుకొన్నాడు.

ఓర్పు, నిష్పాక్షికబుద్ధి, సహనము, ధైర్యసాహసములు, పట్టుదల - ఉండవలసిన గుణములన్నియు ఆతనియందు మూర్తీభవించి

ఉన్నవి. పై పెచ్చు ప్రజాహితైషి, దేశశుభచింతనుడు. మానవస్వభావము తెలిసినవాడు. రాజకీయ నేతృత్వము కలదు. అతని దృష్టి అత్యంతనిశితమైనది. లోతులు చూచు నేర్పుగల ద్రష్ట. మంచివాచా సామర్థ్యము కొరతలేని యితర సభ్యుల మాటలను పెడచెవినిబెట్టి తన మాటయే నెగ్గించు కొనగల సామర్థ్యము గలదిట్టు. ఆ తెలివి తేటలు ఆ చాకచక్యము, ఆ ప్రజ్ఞ అనుపమములు.

ఇతని పూర్వము సర్ ఫ్రెడరిక్ వైట్ అధ్యక్షుడుగా నుండెను. అతని కాలపరిమితి ముగియగానే మరల అధ్యక్షుని యెన్నిక ఆరంభమయ్యెను. ఆ పదవికి విఠలుభాయ్ పేరు సూచింపబడెను. టి. రంగాచారిగారు ప్రత్యర్థిగానిల్చెను. ఈతడు అధికార వర్గమునుండి నిలువబడినాడు. అనధికార సభ్యులందరు పటేలునకే వోటు చేసిరి. కాని అలనాటి శాసన సభలో అనధికార సభ్యుల సంఖ్య చాలా తక్కువ. ఐనను పటేలు విజయము గాంచెను. అతనికి 58 వోట్లు వచ్చినవి. రెండువోట్ల ఆధిక్యతతో పటేలు అసెంబ్లీ అధ్యక్షుడయ్యెను.

1925 ఆగస్టు 24 తేదీన సర్ ఫ్రెడరిక్ వైట్ అసెంబ్లీ హాలునందు సాధారణ సభ్యుల కేర్పరుపబడిన స్థానమున, ఖద్దరు దుస్తులను ధరించి గాంధీటోపీ నెత్తి నలంకరించుకొని క్రిందిభాగమున కూర్చునియున్న విఠలుభాయి జవేర్‌భాయి పటేలు నాహ్వానించి యాతని విజయమును సభికులకు వెల్లడించుచూ - ఆ సభాధ్యక్షపదవిని స్వీకరింపమని కోరెను. వెంటనే ఫ్రెడరిక్ ఆహ్వానమును అంగీకరించి తన కృతజ్ఞతను వెలిబుచ్చెను. ప్రజా ప్రతినిధులలో నుండి అధ్యక్షుడు ఎన్నుకోబడుట కదియే మొదటి పర్యాయము. ఈ సంఘటనము నిజముగ చారిత్రాత్మకమని ప్రభుత్వ సభ్యులు ఆ నాటి తమ యుపన్యాసములలో ఉగ్గడించినారు.

విఠల్ భాయ్ అధ్యక్ష పదవికి ఉచితమైన వేషముతో వచ్చి సర్ ఫ్రెడరిక్ వైట్ ఖాళీచేసిన పీఠమును అధిరోహించినాడు. దేశభక్తుడాయెను. విదేశీయ నూలుతో తయారైన 'విగ్గు' ను పెట్టుకొనుట కాతడిచ్చగించ లేదు. శ్రీమతి సరోజినీ నాయుడు ఒక నల్లని వడకునూలు బట్టనీయ దానినుండి ఒక 'విగ్గు' ఒక 'గాను' తయారు చేయించినారు. అవి ధరించి విఠలుభాయ్ అధ్యక్షపీఠ మలంకరించెను. సభ్యులు కరతాళ ధ్వనులతో నాతనికి స్వాగతమిచ్చిరి. ఆనాడు విఠలుభాయ్ యొసగిన యుపన్యాసము ఉత్కృష్టమైనది, ప్రతిభావంతమైనది—

"నేను పదవీ వ్యామోహమున యీపదవి స్వీకరింపలేదు. ఈపదవి స్వీకరించి మాతృదేశమునకు మరింతసేవ చేయగల్గుదునన్న విశ్వాసము నాకు కుదిరినది. స్వరాజ్యవాదులు విధ్వంసక విమర్శకులని కొందరనుచున్నారు. వారు నిర్మాణాచరణులని కూడ మీరు తెలుసుకొనుడు. వైస్రాయి పరిపాలనావిధులలో మన సాయ మర్థించుచున్నాడు. నేనును అట్టి సహకారమునకే మొగ్గియున్నాను. ప్రభుత్వాధికారులకు నా సాయము మనఃపూర్తిగ ఇవ్వగలవాడను......"

ఒకప్పుడు సహాయ నిరాకరణోద్యమమున తీవ్రముగ కృషిచేసియున్న విఠలుభాయి పటేలు నేడు గొప్ప రాజ్యతంత్రజ్ఞుడై ప్రభుత్వ చక్రమును త్రిప్పువారిలో ఒకడైనాడు.

ఆనాడు మోతీలాల్ నెహ్రూ ప్రభుత్వ ప్రత్యర్థిపక్షమునకు నాయకుడైయుండెను. "నేనిప్పు డేపార్టీకిని చెందను. అన్నిపార్టీలకు చెందినవాడనే." అనిపలుకుచు విఠల్ భాయ్ స్వరాజ్యపార్టీనుండి తన పేరు కొట్టివేయవలసినదిగా మోతీలాలును కోరినాడు.

## స్వరాజ్యవాదులు ఎసెంబ్లీ నుండి వెడలిపోవుట

1926 మార్చి 8 తేదీని అసెంబ్లీలో ఒక విచిత్రసంఘటనము జరిగెను. అంతకు రెండురోజుల క్రితము అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశమై అసెంబ్లీ నుండి కాంగ్రెసు సభ్యులందరును సభవీడి బైటికి వచ్చివేయవలసినదిగా తీర్మానించెను.

"ప్రభుత్వముతో సహకరించి పరిపాలనాచక్రము నడుపుటకు నిశ్చయించి స్వరాజ్యపార్టీ రెండున్నర సంవత్సరములనుండి అసెంబ్లీలో ఉచితసంస్కరణలు ప్రవేశపెట్టుటకు ప్రయత్నించినది. ఆయినను మేము చేయగలిగిన దేమియు కనిపించలేదు, పైగా అవమానితులమైనాము" అని మోతీలాలు ఒక ప్రకటనము చేసి తన స్వరాజ్యపార్టీ సభ్యులందరితో అసెంబ్లీలో నుండి బైటికి నడచిపోయెను. దానితో చేయునది లేక విఠల్ భాయ్ అసెంబ్లీ సమావేశమును వాయిదా వేసి యీక్రింది విధముగా నుడివెను—

"అసెంబ్లీలో అధికసంఖ్యాకమైన స్వరాజ్యపార్టీ బైటికి నడచిపోవటము విచారణీయము. ఆ పార్టీ లేనిదే అసెంబ్లీ ప్రజలకు బాధ్యత వహించినది కాజాలదు. కనుక ప్రజాప్రతినిధులు తిరుగ తమ స్థానములు

స్వీకరించునంతవరకు ప్రభుత్వము విమర్శనాత్మకములగు చట్టములను అసెంబ్లీలో చర్చకు తీసుకొని రాకుండునుగాక! పరిపాలనా చక్రము కుంటుపడకుండ సాగించుటకు మాత్రమే యిప్పటి అసెంబ్లీ ప్రయత్నించవలసియున్నది. ప్రస్తుతము రేపటి ఉదయమువరకు ఈసమావేశమును వాయిదా వేయుచున్నాను."

అసెంబ్లీలో స్వరాజ్యవాదులు లేరుకదా యని ప్రభుత్వము తన యిచ్చవచ్చిన చట్టములను ప్రవేశపెట్టరాదని పటేలు ఉపన్యాసములోని సారాంశము.

1926 నవంబరులో మరల క్రొత్త యెన్నికలు ప్రారంభమయ్యెను. పోటీ లేకుండ విఠలుభాయ్ మరల శాసనసభా సభ్యుడేకాదు, అధ్యక్షుడుకూడ నయ్యెను. అధికారసభ్యులు, యూరపియన్ సభ్యులు కూడ పటేలును అనేకవిధముల శ్లాఘించిరి. అపాగడ్తలకు మరియొకనికైన బుర్ర తిరిగి పోయి యుండెడిది. పటేలు మనోనిబ్బరము, కర్తవ్యదీక్ష సడలనే లేదు.

"ఇంతవరకు బ్రిటిష్ ప్రభుత్వము దేశీయులకు పరిపాలనా బాధ్యతలను ఒప్పగించలేదు. ఒప్పగించిన మరునాడే వారి నిర్మాణ చాకచక్యము బయటపడగలదు. భారతీయులు బాధ్యత లెరుగనివారు కాదు. అసంతృప్తి కరమైనది కనుకనే ప్రస్తుత పరిపాలనా విధానమును వారు నిరసించు చున్నారు. కనుక వెంటనే స్వపరిపాలనావిధులను వారి హస్తగతము చేయవలసినదే" అని ఆనాడు విఠలుభాయ్ ఉద్ఘాటించినాడు.

ప్రభుత్వముతో సహకరించుట యనగా ఆత్మ గౌరవమును చంపుకొని ప్రభుత్వము చెప్పినదాని కెల్ల 'ఊ' కొట్టు బానిస వ్యాపారము కాదు - అని పటేలు తన ప్రవర్తనచే ఋజువు చేసినాడు. ప్రభుత్వ విధానమును ప్రజాభిప్రాయానుగుణ్యముగ మార్చుటకే యాతడు ప్రయత్నించినాడు.

1927 ఏప్రియల్‌లో విఠలుభాయ్ ఇంగ్లండు వెళ్ళెను, కామన్సు సభా సమావేశములకు హాజరై, అక్కడ పార్లమెంటు స్పీకరుతో అనేక పర్యాయములు సంభాషించి పార్లమెంటరీ విధానమును గురించి సమగ్రముగ అభ్యసించి వచ్చెను. ఆ సందర్భమున ఐర్లండు పార్లమెంటునుకూడ అతడు చూచినాడు. జార్జి రాజును కూడ దర్శించినాడు.

**ప్రజాక్షేమ చట్టము (Public safety Bill)**

అసెంబ్లీలో విఠలుభాయ్ అధ్యక్షతను చిత్రవిచిత్రములైన చర్చలు రేగుచుండెడివి. అట్టివాటిలో ప్రజాక్షేమచట్టమును గూర్చినది యొకటి. ఈచట్టము ముఖ్యముగా కమ్యూనిష్టు-కార్యకలాపములను అణగ ద్రొక్కుటకుగాను ఉద్దేశింపబడినది. అయినను అది ప్రభుత్వముచేతిలో మరియొక అపాయకరమగు ఆయుధముగా పరిణమించు అవకాశములుండెను. ప్రజల ప్రాథమికహక్కుల కాచట్టము గొడ్డలిపెట్టు కాగలదు. అందుచేత అసెంబ్లీలోని జాతీయవాదులా చట్టమును తీవ్రముగ ప్రతిఘటించిరి.

పరదేశ ఆశయప్రచారమును భారతదేశములో సాగకుండ నుండ గలందులకై యీచట్టము మరల 1929 ఫిబ్రవరిలో చర్చకు తేబడెను. ఒక సెలక్టుకమిటీ పర్యవేక్షణకు దానిని విడిచిపెట్టినారు.

మూడవతూరి ఏప్రియల్ మాసములో మరలయీచట్టము చర్చకు రానున్న సందర్భమున విఠలుభాయ్ అసెంబ్లీలో ఈవిధముగ ఉపన్యసించినాడు—

"ఈబిల్లును అసెంబ్లీలో చర్చకువచ్చుముందు నేను కొన్నిమాటలు చెప్పదలచినాను. ఈ బిల్లువిషయమై అసెంబ్లీనాయకుడు చేయుచువచ్చిన ఉపన్యాసములు గమనించినాను. మీరట్ కేసులో 31 మందిపై చక్రవర్తి మోపిన నేరములనుకూడ సమీక్షించినాను. ఈ బిల్లునకును, మీరట్ కేసునకును ప్రాతిపదిక ఒక్కటియేయని నాకు తోచుచున్నది. లాకోర్టులలో తీర్పును బడయనున్న విషయములెవ్వియు అసెంబ్లీలో చర్చకురాకూడదన్న విషయము సభ్యులందరు ఎరిగియున్నదే. ఈబిల్లును మనము ఆమోదించినను, త్రోసివేసినను...ఆ మీరట్ కోర్టువారు ఇవ్వవలసిన తీర్పుపై ఈబిల్లు ప్రభావమును ప్రసరించును. ఇటువంటి స్థితిలో యీబిల్లును అసెంబ్లీ చర్చనీయాంశములలో నేనెట్లు చేర్చగలను? కనుక మీరట్ కేసు ముగియునంతవరకు ఈబిల్లును చర్చించుట మానివేయవలసినదిగా నేను ప్రభుత్వమునకు సలహాయిచ్చుచున్నాను. లేదా మీరట్ కేసును పూర్తిగా ఉపసంహరించుకొని యీబిల్లును చర్చించుటకు కడంగెదరుగాక !..."

ఈ మాటలు ప్రభుత్వసభ్యులను కలవరపెట్టినది. మరి రెండు రోజులకు హోమ్-లా-మెంబర్లు దీర్ఘోపన్యాసములు గావించి... అసలీ బిల్లు చర్చకు రాకుండ చేయగల అధికారము అధ్యక్షునకు లేదనియు,

చర్చసందర్భములో సభ్యులు అధిక ప్రసంగములు చేయకుండ నరికట్టుటయే అధ్యక్షుడు చేయజాలినది యనియు వాదించిరి. ప్రజాక్షేమము, దేశరక్షణము ప్రభుత్వపుబాధ్యతలైయున్నవి. తదీయబాధ్యతా నిర్వహణమునకుగాను ప్రభుత్వమునకు కొన్ని ప్రత్యేకాధికారము లావశ్యకములు. పరదేశ ఆశయప్రచారము భారతదేశములో సాగిపోయి అనర్థములకు దారితీయకుండ ప్రభుత్వము ఈచట్టము సహాయమున జాగ్రత వహింపగోరుచున్నది. అంతమాత్రమున మీరట్ కుట్రదారులు నేరస్థులు ఔనా, కాదా అన్న తీర్పు మారిపోవుటకు అవకాశము లేదు, అని యీవిధముగ తర్కించుచు ప్రభుత్వపు సభ్యులు విఠలుభాయ్ సలహాను అంగీకరింపజాలమని తెలిపిరి. ప్రభుత్వబాధ్యతలు నిర్వర్తితములు కావలె; కనుక అత్యవసరమైన యీచట్టము అమలులోనికి రావలసినదే. ప్రజాక్షేమమును లక్షించి వచ్చో మీరట్ కేసును ఉపసంహరించుకొనుటయు జరుగనేరదు - అని వారు నిష్కర్షగ చెప్పివైచిరి.

ఈవిధముగా "ప్రజాక్షేమచట్టము చర్చనీయమేనా, కాదా?" అనునది ఒక సమస్యయయ్యెను. సభ్యులు తమ తమ యభిప్రాయములు వెలిబుచ్చుటకు అవకాశ మీయబడెను. మోతీలాలు నెహ్రూ, యమ్. ఆర్. జయకర్, యస్. శ్రీనివాస అయ్యంగార్ మొదలైన వారందరు మాటాడిరి. చివరకు ఈబిల్లు చర్చకు రానేరదు, రాకూడదు - అని విఠలు భాయి దీనిపై 'రూలింగ్' (నిషేధపుటాజ్ఞ) ఇచ్చెను.

అట్టి నిషేధపు టాజ్ఞ యివ్వగల యధికారము అసెంబ్లీ అధ్యక్షునకు కలదని పటేలు వాదన. అట్టి యధికారము లేదని ప్రభుత్వ సభ్యులనుచున్నారు. అది అధ్యక్షపీఠమునకు ధిక్కారము. మీరట్ కేసు విచారణలో ఉన్నంతకాలము ఈ బిల్లుపై చర్చించుట సమంజసము కాదు. కేవల మొక కపటనాటకము వంటిది, అని విఠలుభాయ్ స్పష్టీకరించెను

ఇట్టి అసాధారణ నిషేధపు టాజ్ఞలు జారీ చేయుచు అధ్యక్షుడు నియంత యగుచున్నాడు - అని యూరపియన్ సభ్యులు వ్యంగ్యములాడిరి. కాని ఇటువంటి తాటాకు చప్పుళ్ళకు విఠలుభాయ్ వెరచువాడు కాదు. తన విధ్యుక్తము నెరవేర్చుటలో అవాంతరముల కెన్నడును అతడు జంకలేదు. అట్టి నిషేధపు టాజ్ఞ జారీచేయు అధికారము తనకు కలదని రుజువు చేసుకొనెను.

**వైస్రాయి, జోక్యము**

ఈ సందర్భములో వైస్రాయి జోక్యము కలిగించుకోవలసి వచ్చెను. విఠలుభాయ్ 'రూలింగ్' జారీ చేయుట చేత ఏర్పడిన పరిస్థితులను సమీక్షించుచు వైస్రాయి అసెంబ్లీకి హాజరయి ఇట్లు ఉపన్యసించినాడు—

“ప్రెసిడెంటు జారీ చేసిన 'నిషేధపు టుత్తరవు'...అసెంబ్లీ కార్యక్రమ నిర్వహణకు సంబంధించిన కట్టుబాటులకు వ్యతిరేకముగ నున్నది. ఈ నిషేధపు టుత్తరవు...దేశ సంరక్షణ బాధ్యతలను నిర్వర్తించుట కోసము ప్రభుత్వమునకు గల ప్రత్యేకాధికారములను ధిక్కరించుచున్నది శాసనసభా కార్యక్రమమునకు సంబంధించిన కట్టుబాటులకు అర్థము చెప్పవలసిన వాడు ఒక్క అసెంబ్లీ అధ్యక్షుడే కాదు, నాకును గలదు. నా కార్య నిర్వాహకవర్గమునకునూ కలదు. ప్రజాక్షేమ చట్టమును గురించిన చర్చను వాయిదా వేసినందున విప్లవచర్యలకు కడంగుచున్నవారి దుష్ప్రయత్నములు, పెరిగిపోవుచున్నవి. ఇట్టి అపాయకర పరిస్థితులలో ఈ చట్టము అమలులోనికి రావలసిన అవశ్యకత యెంతయైన నున్నది. ఇంకను అనేక కారణములు, ప్రస్తుతము వివరించరానివి, కలవు. కాగా ఈ చట్టము మూలమున ప్రభుత్వము కొన్ని ప్రత్యేకాధికారములను పొందగోరుచున్నది. ఆలస్యము అమృతం విషం. కాబట్టి ఇండియా గవర్నమెంటు ఆక్టులోని 72 సెక్షను ననుసరించి 'ఆర్డినెన్సు'ను జారీ చేయుటకు వైస్రాయికి గల అధికారమును నేను పూనెదను.”

**పటేల్ - ఇర్విన్ జాబులు**

నాటితో అసెంబ్లీ సమావేశము ముగిసెను. మరల 1929 సెప్టెంబరులో అసెంబ్లీ సమావేశమయ్యెను. అప్పటికి పటేలు - ఇర్విన్‌లకు కొన్ని ఉత్తర ప్రత్యుత్తరములు నడిచియుండెను. వాటిని గురించిన పూర్తి వివరాలను అధ్యక్షుడు తమకు ఎరుకపరచునేమో యని అసెంబ్లీ సభ్యులు ఆశించిరి.

అసెంబ్లీలో ఒకబిల్లును చర్చకురాకుండ నిలుపగల అధికారము అధ్యక్షునకు లేదని వైస్రాయికావించిన విమర్శనమును పటేలు నిరసించెను. వైస్రాయి అనవసరపు జోక్యమును అతడు నిందించెను. ప్రెసిడెంటు 'రూలింగ్'ను విమర్శించగల అధికారము అసెంబ్లీ సభ్యులకేగాని మరెవరికిని లేదు.

తరువాత పటేలు తనకును వైస్రాయికిని మధ్యనడచిన ఉత్తర ప్రత్యుత్తరములను సభికులకు చదివి వినిపించినాడు. అసెంబ్లీలో అధ్యక్షుడే సర్వాధికారియన్న విషయమును వైస్రాయికూడ చివరకి ఒప్పుకొనక తప్పినదికాదు.

అసెంబ్లీకి ఆత్మగౌరవము ఉన్నది. కొన్ని అధికారము లున్నవి. తాను అధ్యక్షపీఠ మలంకరించిన నాటినుండి విఠలుభాయ్ అసెంబ్లీ గౌరవప్రతిష్ఠలను కాపాడుటకు ప్రయత్నించెను. దాని స్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లనీయలేదు. కౌన్సిల్ నాలుగు గోడలమధ్య సభ్యులును, అధ్యక్షుడును సర్వాధికారులు. వారి అధికారమునకు, గౌరవమునకు భంగముకలిగించు ప్రయత్నముల నాతడు ఆదినుండియు ఎదుర్కొనుచునే యుండెను. అట్లు ఎదుర్కొననినాడు తన విధ్యుక్తమునుండి మరలిపోయిన వాడనగుదునని యాతడెంతయో మెళుకువతో నుండెను. అందుచేత వైస్రాయి యుపన్యాసాంశములను విమర్శించుచు, తన ప్రవర్తనమును సమర్థించుకొనుచు ఇర్విన్‌కు జాబువ్రాసెను.

తిరుగుజాబులో వైస్రాయి అసెంబ్లీ అధ్యక్షుని సర్వాధికారములను అంగీకరించెను. పటేలు 'రూలింగ్'ను విమర్శించుట తన యుద్దేశము కాదనెను. అసెంబ్లీ గౌరవప్రతిష్ఠలను కించపరచుట తన కోరిక కాదని వ్రాసెను. అంతటితో ఆసమస్య ఉపసంహృతమాగాక యని కోరుచు తన జాబును ప్రకటించెను.

అసెంబ్లీ అధ్యక్షుడై విఠలుభాయి సాధించిన అఖండ విజయమిది.

**అసెంబ్లీ భవనాలు**

మీరట్ బాంబుసంఘటనల అనంతరము అసెంబ్లీ భవనాల రక్షణ విషయమై కొంత సంచలనము జరిగెను. ఈ సందర్భమున విఠల్‌భాయ్ కనబరచిన దృక్పథము ప్రదర్శించిన ప్రవర్తనము గమనింపదగినవి.

అసెంబ్లీభవన రక్షణ విషయమై ప్రభుత్వమునకు సలహానిచ్చు నిమిత్తము విఠల్‌భాయ్ ఒకకమిటీని నియమించుటకు నిశ్చయించెను. ఇందునుగూర్చి అసెంబ్లీలో భిన్నాభిప్రాయములు రేగెను. 1930 జనవరి 20 తేదీని అసెంబ్లీ సమావేశమైనప్పుడు పోలీసువారువచ్చి గ్యాలరీలలో ఆసీనులైనారు. అధ్యక్షుడు వచ్చుచునే ఒక్కచూపులో వారిని గమనించినాడు. వెంటనే ఆతడు వారిని గ్యాలరీలువిడిచి వెళ్ళిపోవలసినదిగా ఆజ్ఞాపించెను. కాని కొందరుపోలీసులు మొదట తిరస్కరించినను చివరకు

గ్యాలరీలు ఖాళీచేసి వెళ్ళిపోక తప్పలేదు. అందరు వెళ్ళిపోయిన తరువాత గ్యాలరీలకు తాళములు వేసినారు.

సర్ జేమ్సు గ్రేరార్ ఏమో పలుకబోయినాడు. అది తన రూలింగ్ నకు ధిక్కారము కాగలదని అధ్యక్షు డాతనికి మాటలాడుట కవకాశ మీయలేదు. తరువాత అధ్యక్షుడు ఈ క్రిందివిధముగ ఉపన్యసించెను.

“అసెంబ్లీలోనికి ప్రేక్షకులనుగాని తదితరులనుగాని రానిచ్చు విషయమున ప్రభుత్వాధికారులకు, అసెంబ్లీ అధ్యక్షునకును భేదాభిప్రాయ ములు ఏర్పడినవి. అసెంబ్లీని, అసెంబ్లీ అధ్యక్షుని రక్షించుబాధ్యత తమపై నున్నదని ఇండియా ప్రభుత్వము తరఫున ఢిల్లీ పోలీసు ఛీఫ్ కమీషనరు అభిప్రాయ పడుచున్నాడు. అందుచేత వలసినంతమందిని పోలీసుభటులను అక్కడక్కడ నిలిపి తగుజాగ్రతలో ఉండవలసిన యావశ్యకత తమకు కలదని ఆయన వాదన. కాని అసెంబ్లీ అధ్యక్షుని అభిప్రాయమేమన అసెంబ్లీ ఆవరణలో అధ్యక్షుడే సర్వాధికారి. అసెంబ్లీ రక్షణవిషయమై అతని నిర్ణయమే ప్రధానముగా అనుసరింపవలసి యుండును. అంతేగాని అధ్యక్షుని యంగీకారములేని ఎట్టి విధానములైనను అసెంబ్లీ ఆవరణలో ఎవరును అమలుచేయుటకు వీలులేదు.

నిన్నరాత్రి తొమ్మిదిగంటల తరువాత ఢిల్లీ కమీషనరు వద్దనుంచి నాకొక జాబు వచ్చినది. అందులో తాను పోలీసువారికి జారీచేసిన ఉత్తరువులను పొందు పరచినాడు. ఆయుత్తరువులను రహస్యముగ నుంచవలసినదిగ ఆయన కోరినాడు. అందుచేత వాటిని నేనిప్పుడు బహిరంగపరచను.

అప్పుడే హోంమెంబరు వద్దనుంచికూడ ఒక యుత్తరము వచ్చినది. అసెంబ్లీప్రేక్షకులను తనిఖీచేయుట, గ్యాలరీలలో పోలీసుభటులు కాపుండుట. ఈ రెండు అంశములకు వైస్రాయి అంగీకరించినట్లును, ఢిల్లీ కమీషనరు వాటిని అమలుపరచి అసెంబ్లీ రక్షణభారము వహింపనున్నట్లును హోంమెంబరు నాకు ఎరుకపరచినాడు.

కాని ఒక్క సంగతి మనవి చేయుచున్నాను. అసెంబ్లీ రక్షణ సమస్య విషయమై మనకు సలహాల నిచ్చు నిమిత్తము మన మొక కమిటీని నియమించినాము. ఆ కమిటీ తన విజ్ఞప్తి తయారు చేసి మన కందజేసెను. అందుమీద అసెంబ్లీ అధ్యక్షుడు కొన్ని యుత్తరువులను జారీ చేసి యున్నాడు. ఇట్టి సందర్భములో ఢిల్లీ కమీషనరు ఏవో తన యిచ్చవచ్చిన విధానములను అమలుచేయ బూనుకొనుట అసెంబ్లీ అధ్యక్షుని

యు త్తరువులను ధిక్కరించుచున్నట్లయినది; అసెంబ్లీ అధ్యక్షుని అధికార ముల కది చెంప పెట్టగుచున్నది. గ్యాలరీలు అసెంబ్లీ ఉద్యోగుల రక్షణ లోనే యుండవలెననియు, ఇంగ్లండు కామన్సు సభలలోవలె ఒక్క పోలీసు భటుడు మాత్రం శేసన్సులలో ఉంచవచ్చుననియు అధ్యక్షుని ఆజ్ఞ. కాని ఛీఫ్ కమిషనరు నలుగురు పోలీసు భటులను అధికార దుస్తులలో తెచ్చి గ్యాలరీలో ప్రతిష్ఠించినాడు.

ఛీఫ్ కమిషనరు పోలీసువారికి అందజేసిన యుత్తర్వులను జాగ్రతగా పరిశీలించినాడు. అసెంబ్లీలో అధ్యక్షుని యధికారమును త్రోసిరాజని ప్రభుత్వపు ప్రాబల్యమును ప్రాకించుటయే వాటిలోని ఆంతర్యము. కాబట్టి పత్రికా విలేఖరుల గ్యాలరీ మినహా మిగిలిన వన్నియు వెంటనే ఖాళీ చేయించి, మూసివేయవలసినదిగా కోరినారు. ఈలోగా ప్రభుత్వము తన విధానమును పునః పరిశీలించుకొనును గాక ! నేనుకూడ అసెంబ్లీ అధ్యక్షపీఠ గౌరవ సంరక్షణమునకు నా కర్తవ్యములను ఆలోచించుకొనియెదను."

ఈ ప్రతిష్టంభనము నెల రోజులవరకు అంతము కాలేదు. తుదకు వైస్రాయికూడ జోక్యము కలుగ జేసుకొనవలసి వచ్చెను. వైస్రాయి పటేల్ దృక్పథమును గౌరవించుచు అసెంబ్లీ రక్షణ విషయమై ఒక సమరసవిధానమును సూచించెను.

అసెంబ్లీరక్షణము అవశ్యకర్తవ్యము. కాగా ఒక సీనియర్ పోలీసు ఉద్యోగి అసెంబ్లీ నౌకరిలో ఉండగలడు. అధ్యక్షుడు సూచించిన రక్షణ విధులు లోపభూయిష్టములనిగాని, చాలవనిగాని అతనికి తోచినచో తన యభిప్రాయములను అతడు తన పైయుద్యోగికి తెలియజేయవలెను. వారిద్దరును సంప్రదించుకుని తమ విజ్ఞప్తిని అధ్యక్షునకు అందజేయవలెను. అధ్యక్షుడు దానిని తన వ్యాఖ్యానములతో వైస్రాయికి పంపించవలెను. ప్రభుత్వము సమాలోచించుకొని అధ్యక్షునికి తగు సలహాల నివ్వగలదు. పరిస్థితులు ఆకస్మికప్రమాదభరితములైనప్పుడు, అధ్యక్షునితో సంప్రదించుట కవకాశము లభించనప్పుడు- ఆసీనియర్ ఆఫీసరు తనకు అయ్యావసరమున ఉచితమని తోచినట్టుగా ప్రవర్తింపవచ్చును. అసెంబ్లీకి ఒక ప్రత్యేక రక్షణశాఖ ఉండవలెనని ప్రభుత్వసభ్యుల కోరికను వైస్రాయి మన్నించినాడు. అట్టి శాఖను కాలక్రమమున నెలకొల్పుట కాతడు సమ్మతించెను. అధ్యక్షునకు ఇష్టమగు 'యూనిఫారం'ను ఆ శాఖ వారు ధరించవచ్చును. అంతవరకును ప్రభుత్వపు పోలీసు భటుల సహాయము

అసెంబ్లీకి లభించగలదు. వారు అధ్యక్షుడు సూచించిన ప్రత్యేక చిహ్న మేదైన ధరించవచ్చును. అసెంబ్లీ ప్రత్యేకరక్షణ శాఖను సమకూర్చుటకు త్వరలోనే ప్రయత్నింతునని వైస్రాయి హామీ యిచ్చినాడు. ఇక అసెంబ్లీ బాహ్య ఆవరణ రక్షణ విషయమై స్థానికప్రభుత్వము వారు అసెంబ్లీ అధ్యక్షునితో సంప్రదించి తగు విధానములను గైకొనియెదరు.

ఇట్లు పైని ఉదాహృతములైన వైస్రాయి సూచనలు సమంజసము గనే యున్నవి. అసెంబ్లీ అధ్యక్షుని సర్వాధికారములకు భంగమురాలేదు. ముమ్మందు ఒక ప్రత్యేక అసెంబ్లీ రక్షణశాఖ ఏర్పడనున్నది. అసెంబ్లీ సభ్యులకు పైసూచనలు నచ్చినవి. ప్రతిష్టంభనము తొలగిపోయినది. ఆ మరునాటినుండి అసెంబ్లీ గ్యాలరీలు తెరువవలసినదిగ విఠల్ భాయ్ పటేల్ ఆజ్ఞాపించెను.

**రిజర్వుబ్యాంక్ బిల్లు**

ప్రథమములో ఒక రిజర్వుబ్యాంక్ బిల్లును ఆర్థికసభ్యుడు అసెంబ్లీలో ప్రవేశ పెట్టినాడు. తరువాత అది ముప్పదిమంది సభ్యులు గల ఒక జాయింటు సెలక్టు కమిటీ పరిశీలనకు జారీ చేయ బడినది.

రిజర్వు బ్యాంకు స్టేట్ బ్యాంక్ గా ఉండవలెనా, స్టాక్ హోల్డర్స్ బ్యాంకుగా ఉండవలెనా? ఎవరెవరు డైరెక్టర్లుగా ఉండవలెను?- ఈ రెండు అంశములపై ప్రభుత్వమునకు, అనధికారసభ్యులకు వాద ప్రతివాదములు జరిగెను. అనధికారసభ్యులదే పై చేయి యైనది. ఆర్థిక సభ్యుడు వారి అభిప్రాయములను మన్నించ వలసి వచ్చెను. బిల్లులోని యంశములన్నియు సమగ్రముగ పరిశీలింపబడినవి. చివరకు ఎవరెవరు డైరెక్టర్లుగా ఉండవలెనన్న సమస్య చర్చకు వచ్చెను. అంతటితో సభ ముగిసెను.

తరువాత మూడవనాడు అసెంబ్లీ సమావేశమయ్యెను, చర్చకు మరికొన్నాళ్ళు తనకు వ్యవధానము కావలెనని ఆర్థికసభ్యుడు కోరెను. కోరిక మంజూరు అయ్యెను. కాని తరువాత మరల అసెంబ్లీ సమావేశమై నప్పుడు రిజర్వుబ్యాంకు బిల్లును చర్చించు నుద్దేశము ప్రభుత్వమునకు లేదని ఆర్థికసభ్యుడు ప్రకటించెను. ఇది అనధికార సభ్యులకు కంటక మనిపించి స్వరాజ్యపార్టీవారు సభవిడిచి వెళ్ళినారు. తరువాత ఆర్థిక సభ్యుని ప్రవర్తనమును నిరసించుచు అసెంబ్లీలో ఒక తీర్మానము ప్రతిపాది తమై నెగ్గినది కూడ.

మరి కొన్నాళ్ళకు ఆర్థికసభ్యుడు మరొక కొత్త రిజర్వుబ్యాంకు బిల్లును ప్రతిపాదించుటకు పూనుకొనెను. మొదటిబిల్లు ఉపసంహృతము కాకుండ రెండవబిల్లును ప్రతిపాదించుటకు వీలులేదని పటేల్ ఖండితముగ చెప్పివైచెను. "మొదటి బిల్లును ప్రభుత్వము ఉపసంహరించుకొని రెండవ బిల్లును ప్రతిపాదించ వలసియున్నది. ఇంగ్లండు కామన్సు సభలోకూడ ఇదేఆచారము. లేదా కాలదోషముపట్టి మొదటిబిల్లు మృతిచెందవలెను. ఒకసభ్యుడు ఒకబిల్లును ప్రతిపాదించినప్పుడు అది అతని చేతులనుండి సభ్యులందరి చేతులలోనికి వచ్చినదన్నమాట. సభ్యులందరి అంగీకారము లేనిదే అందులో ప్రధానమైన మార్పు లేమియు చేయరాదు. ఆర్థిక సభ్యుడు తన మొదటిబిల్లును ఉపసంహరించుకొని ఈ కొత్తబిల్లును ప్రతిపాదించుట సమంజసము. పైగా అతని మొదటిబిల్లును చాలవరకు చర్చించి కొన్ని నిర్ణయములకు వచ్చినాము. ఈ కొత్తబిల్లు ఆనిర్ణయాలనుకూడ ఛేదింప జూచుచున్నది. పైగా ఈక్రొత్తబిల్లు వైస్రాయి ఆజ్ఞ ననుసరించి అప్పుడే 'గజెట్' లో ప్రచురితమైనది. ఇది శాసనసభా పద్ధతులకు విరుద్ధము. శాసనసభాధికారమునకు ధిక్కృతి. కనుక ఆర్థికసభ్యుడు తన కొత్తబిల్లును ప్రతిపాదించుటకు నేను అంగీకరింపను." అని విఠల్ భాయ్ ఖచ్చితముగ చెప్పెను.

మొదటి బిల్లును ఉపసంహరించుకొనుట అగౌరవముగ తోచి ప్రభుత్వ మాపని చేయలేదు. అందుచేత రెండవదానిని ప్రతిపాదించుటకు వీలు చిక్కలేదు. నోరు నొక్కుకొని ఊరుకుండవలసి వచ్చెను.

**ప్రత్యేక అసెంబ్లీ డిపార్టుమెంటు.**

ప్రత్యేక అసెంబ్లీ డిపార్టుమెంటును నెల కొల్పవలెనన్న సమస్యమీద 1928 సెప్టెంబరు 5 తేదీన అసెంబ్లీ అధ్యక్షుడు విఠల్ భాయ్ పటేల్ ఇట్లు ప్రకటించెను.

"శాసనసభ యెన్నుకొనిన అధ్యక్షుడను నేను. అనగా శాసన సభకు బాధ్యత వహించి యున్నాను. మరే అధికారమునకు కాను. శాసనసభా సభ్యుల వాంఛితములను అధ్యక్షుడు త్రోసిపుచ్చరాదు. అతనికి రూలింగ్ అధికారము ఉన్నమాట వాస్తవమే. కాని అతని రూలింగ్ న్యాయబద్ధమై యుండవలెను. అతడు అన్ని పార్టీల యెడ నిష్పాక్షికముగ ప్రవర్తించవలసి యున్నది. అసెంబ్లీ రూల్సును న్యాయయుతముగ అర్థముచెప్పి, తదనుసారముగ ప్రవర్తించవలెను. కాని ఈ'రూల్సు' శాసన సభా సభ్యులు నిర్ణయించినవి కాదు. వారికి వాటిని సంస్కరింపగల

అధికారము లేదు. అప్పుడప్పుడు ఇండియా కార్యదర్శి అనుమతితో రాజ ప్రతినిధియే వాటిని సంస్కరించుచుండును. అట్లు సంస్కరించు సందర్భమున ఆయన అసెంబ్లీ సభ్యులనుగాని, అధ్యక్షునిగాని సంప్రతించు ఆచారమే లేదు. అధ్యక్షుడు కేవలము అసెంబ్లీ కార్యదర్శి సలహాపై ఆధారపడి యుండవలెను.

అసెంబ్లీ సభ్యులందరు కూడ తమ విధ్యుక్త నిర్వహణకు కార్యదర్శిపై ఆధారపడియున్నారు. కాని ఏమైన పొరపాట్లు సంభవించినచో ఆ తప్పు అధ్యక్షునిపై పోయి పడుచున్నది. కనుక అసెంబ్లీ కార్యక్రమ నిర్వహణము నిర్దుష్టముగ, తృప్తికరముగ కొనసాగవలెనన్న అసెంబ్లీ కార్యదర్శియు, అతని యనుచరులును అసెంబ్లీకిని, అధ్యక్షునకును బాధ్యత వహించిన వారై యుండవలెను. మరొక అధికారమునకు లోబడియుండా రై యుండరాదు. వారివల్ల అధ్యక్షునకు తను హృదయ పూర్వకమైన సలహాలు లభించుచుండవలెను. అసెంబ్లీ సేవయే వారి ప్రధాన బాధ్యతయై యుండవలెను.

"కాని ప్రస్తుతము వీరు అసెంబ్లీ సేవకులు గారు. వైస్రాయికి బాధ్యత వహించిన వారేగాని అసెంబ్లీ అధ్యక్షునకు కారు. ప్రభుత్వమునకు, ప్రజాప్రతినిధులకు భేదాభిప్రాయము వచ్చినపుడెల్ల అసెంబ్లీ కార్యదర్శి ప్రభుత్వ పక్షము వహించును; ప్రభుత్వ సభ్యులతో పాటు వోటు చేయును; వారితో చేతులు గలిపి, వారిలో వాడై వ్యవహరించును. కాగా అతను ఇంచుమించు ప్రభుత్వము నియమించిన ఒక సభ్యుడైనాడని చెప్పవచ్చు. అసెంబ్లీ సభ్యులకుగాని, అధ్యక్షునకు గాని అతనిపై యెట్టి అధికారము లేదు; అతని స్వేచ్ఛను కాదనుటకు వీలు లేదు. కనుక అట్టి కార్యదర్శి ద్వారా లభించు సలహాలు స్వతంత్రములవి, పక్షపాతరహితములని విశ్వసించలేము. అందుచేత అసెంబ్లీ ఉద్యోగశాఖలో తీవ్రసంస్కారము అవసరము.

"ఇటీవలనే నాకోరిక ననుసరించి వైస్రాయి - అసెంబ్లీ కార్యదర్శిని, అసెంబ్లీ సభ్యునుగా నియమించు ఆచారమునకు స్వస్తిచెప్పినాడు. సంతోషమే. కాని అంశమాత్రముననే సర్వము చక్కబడినట్లు కాదు కదా!

"ఇక అసెంబ్లీ ఉద్యోగులనుగూర్చి ఒక్కమాట! వీరు అసెంబ్లీ అధ్యక్షుని సమీపించి, అతని సలహాల నడిగి తెలుసుకుని, తదనుగుణ్యముగా

తమవిధులు నిర్వర్తించుకొనుటకు సంకోచించుచున్నారు. అంతమూలమున తమపై అధికారులకు (ప్రభుత్వపు జోహుకుందారులకు) కోపము కలుగునేమో యని వారిభయము. అసెంబ్లీసభ్యులకు తమ విధినిర్వహణమునందు తగుమైన సలహాలు, వీళ్ళు లభించకపోవుటకు అదియే కారణము. అధ్యక్షుని లోపమేమియు లేదు. అసెంబ్లీరూల్సును సంస్కరింపగల యధికారమే అధ్యక్షునకున్నచో అతడు సభ్యులకెంతయైన సహాయకారి, పురోమార్గదర్శి కాగలడు. కాని అది ప్రస్తుత రాజ్యాంగమున అసంభవము. పోనీ, అసెంబ్లీకార్యదర్శి ఒక ప్రభుత్వోద్యోగి కాకుండ ఒక స్వతంత్రవ్యక్తియై యుండినచో చాలనయము. అసెంబ్లీకార్యదర్శి అసెంబ్లీ అధికారమునకు గాక, మరొక అన్య - అధికారమునకు లొంగియున్నవాడగుట దుస్సహము.

“ ఈ విషయము లన్నియు నేను 1925 అగస్టులో అధ్యక్షపదవి స్వీకరించిననాడే తెలుసుకొన్నాను. తరువాత జనవరిలో శాసనసభాధ్యక్షుల సమావేశము జరిగెను. శాసన సభకు అధికార వర్గముతో సంబంధములేని ఒక ప్రత్యేక ఆఫీసు ఉండవలెనని తీర్మానించడ మైనది. నేనా తీర్మానమును ఇండియా ప్రభుత్వము వారి పరిశీలనకు పంపాను. జవాబు లేదు. ఇంకను ఆలోచించుచున్నారు కాబోలునని సంవత్సరము ఓపిక పట్టినాను. లాభము లేకపోయినది. తరువాత సెప్టెంబరు నెలలో శాసన సభలకు ఒక ప్రత్యేక ఆఫీసు డిపార్టుమెంటును సృష్టించుటకు ఒక విధానమును ఇండియా ప్రభుత్వమునకు సూచించినాను.

“ఆవిధానము ఇది. (1) అసెంబ్లీ ఆఫీసు గవర్నమెంటు డిపార్టుమెంటుతో సంబంధములేని ఒక ప్రత్యేక స్వతంత్రశాఖ. (2) అందలి యుద్యోగులు కేవలము అసెంబ్లీ అధికారమునకు లొంగి యుండవలసినదే (3) ఈ క్రొత్త డిపార్టుమెంటుకు వలసిన ఖర్చు ప్రభుత్వము భరించవలె. ఆఖర్చు నిర్ణయము అసెంబ్లీ సభ్యులది.

“ ఈ పైసూచనలను అమలు పరచుటకు అతృతుడనై యున్నానని ప్రభుత్వమునకు తెలియును - కనుక వారు దానిని త్వరగా పరిశీలింతురని యాశించితిని. చివరకు వైస్రాయితో కూడ రెండు మూడు పర్యాయములు సంభాషించి వచ్చితిని.

“ కాని గవర్నమెంటు డిపార్టుమెంటులతో ఏవిధమైన సంబధమూ లేని అసెంబ్లీ ఆఫీసును సృష్టించుటకు బ్రిటిష్ ప్రభుత్వము ఒప్పుకో

లేదు. అంతేగాక అసెంబ్లీ సెక్రెటరీ గాని, అతని ఉద్యోగులుగాని నిర్భయముగా, సమర్థతతో తమ విధులను నెరవేర్చ గలుగుటకు వారిపై అసెంబ్లీ అధ్యక్షుని యధికారము ఏమాత్రమును ఉండరాదని వైస్రాయి అభిప్రాయపడెను. ఈ యభిప్రాయము సమంజస మైనదని నేననుకోను. ప్రస్తుతము దండనాధికారము, సస్పెండు చేయు, 'లేదా బర్తరఫ్ చేయు అధికారములు వైస్రాయికి ఉన్నవి కదా. ఈ యధికారాలు అసెంబ్లీకి దత్తములు కానిచో అవి వైస్రాయికే ఉండునుకదా! ఇక అసెంబ్లీ ఆఫీసును ప్రత్యేకముగ సృష్టించిమాత్ర మేమి లాభము.

"నేను ఈ క్రింది మార్పులను సూచించినాను - (1) ఒక ప్రత్యేక అసెంబ్లీ ఆఫీసును నెలకొల్పు అధికారము ఇండియా ప్రభుత్వానికి లేని పక్షమున ఈ క్రొత్త ఆఫీసు డిపార్టుమెంటును గూడ వైస్రాయి పోర్టు ఫోలియోలో ఒకటిగా నుండవచ్చును. (2) అసెంబ్లీ అధ్యక్షుని సలహా పురస్కరించుకొని అందు ప్రధానోద్యోగులను వైస్రాయియే నియమించవచ్చును. (3) ఆ యుద్యోగులను దండించవలసి వచ్చినప్పుడు, లేదా బర్తరఫ్ చేయవలసి వచ్చినప్పుడు ఆ విషయము అసెంబ్లీ వైస్రాయికి ముందుగా తెలియజేయగలదు. (4) ఆ డిపార్టుమెంటు సభ్యులను కార్యదర్శి సలహాల స్వీకరించి అసెంబ్లీ అధ్యక్షుడు నియమించును. (5) వీరిని దండించవలసి వచ్చినప్పుడు అధ్యక్షుడు కార్యదర్శిని సంప్రదించ గలడు. (6) ఈ డిపార్టుమెంటు ఆదాయ వ్యయపట్టిక అధ్యక్షుడు, కార్యదర్శి కలసి తయారు చేయుదురు. ఇదికూడ అసెంబ్లీ సాంవత్సరిక ఆదాయ వ్యయ పట్టికలో ఒక భాగమై యుండును. అందులో అవసరమైన మార్పులు సూచించుటకు అసెంబ్లీ సభ్యులకు అధికారము కలదు.

"ఈ నాసూచనల గూర్చి మన రాబోవు సమావేశములో సమగ్రముగ చర్చించుకొందము గాక......"

తరువాత సెప్టెంబరు నెలలో అసెంబ్లీ సమావేశమయ్యెను. విఠల్ భాయి సూచించిన పై మార్పులు సమంజసములని సభ్యులు అంగీకరించినారు. మోతీలాల్ పండితుడు లేచి "1928 డిశంబరు 1 తేదీలోపుననే ఒక ప్రత్యేక అసెంబ్లీ ఆఫీసు డిపార్టుమెంటు నెలకొల్పవలెను. అందుకు ఇండియా కార్యదర్శి అనుమతిని సంపాదించు నిమిత్తము ఇండియా ప్రభుత్వము వెంటనే కృషి చేయవలెను" అని యొక తీర్మానమును ప్రతిపాదించెను.

ఆ తీర్మానము నెగ్గెను. తత్ఫలితముగా ప్రత్యేక అసెంబ్లీ ఆఫీసు డిపార్టుమెంటు స్థాపితమయ్యెను.

బ్రిటిష్ గవర్నమెంటుపై దెబ్బ

అధ్యక్ష పీఠ గౌరవము తీయుటకే అధ్యక్షుడు విఠల్ భాయ్ ప్రత్యేక అసెంబ్లీ ఆఫీసు డిపార్టుమెంటు స్థాపనకు

ప్రయత్నించినాడనియు, 1928 సెప్టెంబరులో 'ప్రజాక్షేమ చట్టము' చర్చకు రాకుండ తన 'రూలింగ్' జారీచేయుటలో కేవలము పక్షపాత బుద్ధితో వ్యవహరించినాడనియు బొంబాయి 'టైమ్సుఆఫ్ ఇండియా' పత్రిక విమర్శించెను. ఈ విమర్శనము చాలక్రూరముగ నున్నదనియు, అది అధ్యక్షపీఠమును అగౌరవించిన ట్లున్నదనియు వక్కాణించి గయాప్రసాద్ సింగ్ తన్నిరసన సూచకముగ అడ్జర్నమెంటు తీర్మానమును ప్రవేశపెట్టదలచెను. కాని విఠల్ భాయి రూలింగ్ జారీచేసి ఆవిషయము చర్చకు రానీయలేదు.

అట్టి తీర్మానములు సాధారణముగ ప్రత్యక్షముగనో, అప్రత్యక్షముగనో ప్రభుత్వపు చర్యలనుమాత్రమే నిరసించునట్టివై యుండవలెను. ఒకప్పుడు కామన్సు సభలోకూడ ఇట్టిసమస్యయే ఉద్భవించెను. కొందరు సభ్యులు 'డైలీ మెయిల్' పత్రికపై నిరసన తీర్మానమును ప్రతిపాదింప దలచిరి. ఆపత్రిక కొందరు పార్లమెంటు సభ్యులను తీవ్రముగ నిందించిన దట. మొదట స్పీకరు ఆ ప్రతిపాదనమును చర్చించుటకు అనుజ్ఞనిచ్చెను. కాని తరువాత ... ఎట్టినిరసన తీర్మానమైనను ప్రభుత్వ ప్రవర్తనమునకు సంబంధించినదై యుండవలెనన్న సంగతి గుర్తుకువచ్చి యాతీర్మానమును ఉపసంహరించుకొన వలసినదిగా సభ్యులను కోరినాడు.

ఒక్క 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రికయే కాదు. మరికొన్ని పత్రికలుకూడా విఠల్ భాయ్‌ని ఆడిపోసినవి. వాటిలో లండన్ 'డైలీ టెలిగ్రాఫ్' పత్రికకూడ ఒకటి. అధ్యక్షుడు కేవలము పక్షపాతబుద్ధితో వ్యవహరించు చున్నాడని ప్రభుత్వసభ్యులే గుర్తించి ఒకసారి ఆయనను నిలువదీసి అడిగినారు' అని 'పాయొనీర్' పత్రిక వ్రాసినది. మోతీలాల్ పండితుడొక పర్యాయము ఈసంగతులన్నియు అధ్యక్షునకు గుర్తుచేసి 'ఈ పత్రికలవారు అధ్యక్షునిపై దాడి ఆరంభించినారు' అని పలికెను. గవర్నమెంటువారు అధ్యక్షుని చర్యలను ఒకకంట కనిపెట్టుచునే యున్నారు - అని 'పాయినీర్' పత్రిక వ్రాసెను.

కాని విఠల్‌భాయ్ చలించలేదు. అతడు మేరు పర్వతమువలె ధీరోదాత్తుడు. తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరునా? పలుగాకులు విసరు రాళ్ళు చంద్రబింబమును స్పృశింపగలవా?

“నేను అసెంబ్లీ అధ్యక్షుడను కాదా? ఒక బందీనా యేమిటి? గవర్నమెంటు వారు నాచర్యలను అస్తమానము కనిపెడుతూ ఉండడానికి?” అన్నాడు పటేల్ హాస్య పిచ్ఛిలముగా.

హోమ్‌మెంబరు కూడ ఆపత్రికా ప్రకటనలను నిరసించినారు. ఆయా పత్రికలపై అధ్యక్షుడేమైన చర్య తీసుకొనదలచినచో అసెంబ్లీ అతని పక్షమున నిలువగలదని హామీ యిచ్చినాడు. కాని పత్రికలపై, పత్రికావిలేఖరులపై ఎట్టి చర్యగైకొనుటకును విఠల్‌భాయ్‌కి ఇష్టములేదు. వారంతట వారే క్షమాపణలు చెప్పుకొందురని యాశించి ఊరకుండెను. కాని ఎన్నాళ్ళు గడచినను వారు క్షమాపణలు చెప్పుకొనలేదు. పైగా ఒక పత్రికా విలేఖరి ‘మీ అసెంబ్లీలోని వివిధపార్టీ సభ్యులే స్వయముగా చెప్పిన మాటలను పురస్కరించుకొనియే నేను వ్యాఖ్యానించినాను’ అని అధ్యక్షునకు ఉత్తరము వ్రాసినాడు. అది పుండుపై కారము చల్లినట్లయ్యెను. కాని భారతదేశమందలి తదితర పత్రికలన్నియు విఠల్‌భాయ్ పక్షమే వహించెను. అసెంబ్లీ సభ్యులందరును అధ్యక్షుని నధిక్షేపించిన పత్రికా విలేఖరుల వ్రాతలను నిరసించినారు. అంతకన్న అతడింకేమి ప్రతీకారము నెరపవలెను?

అసెంబ్లీ అధ్యక్షుడు అప్పుడప్పుడు రాష్ట్రీయ శాసన సభలకు వెళ్ళి వచ్చు ఆచారము ఫ్రెడరిక్ వైట్ కాలమునుండియు కలదు. విఠల్‌భాయ్‌కూడ తాను అధ్యక్ష పీఠమెక్కిన తరువాత అనవాయితి ననుసరించి కొన్ని రాష్ట్రీయ శాసనసభలను దర్శించి వచ్చెను. ఈ దర్శించివచ్చుటను ఒక పత్రిక తీవ్రముగ విమర్శించెను. దానికి అధ్యక్షుడు అసెంబ్లీ సభలో తగినట్లుగానే జవాబు చెప్పెను.

అసెంబ్లీ అధ్యక్షుడు రాష్ట్రశాసన సభలను దర్శించి వచ్చు ఆచారము విఠల్‌భాయ్ క్రొత్తగ ఆరంభించినది కాదుకదా! మాంటేగ్—చెమ్సుఫర్డు సంస్కరణలు అమలు జరిగి నప్పటినించి వచ్చుచున్న యాచారమది. అసెంబ్లీ అధ్యక్షుడు రాష్ట్రీయశాసనసభా అధ్యక్షులకు మార్గదర్శకుడు సలహాదారుడుగ ఉండవలెనన్న ఆశయముతో ఆపద్ధతి అవలంబించినారు.

దానినను సరించి సర్ ఫ్రెడరిక్ వైట్ అసెంబ్లీ అధ్యక్షుడుగ నియమితుడైన వెంటనే చాల రాష్ట్రములకు వెళ్ళి శాసనసభలను దర్శించినాడు. ముందుగా అప్పుడు ఇండియా కార్యదర్శిగ నుండిన మాంటేగ్ తో తన విధులను గూర్చి చర్చించుకొనెను. అసెంబ్లీ అధ్యక్షుడు రాష్ట్రీయ శాసనసభాధ్యక్షులతో సన్నిహిత సంబంధము ఏర్పరచుకొనుట వాంఛనీయమని మాంటేగ్ సూచించెను. అట్లే సర్ ఫ్రెడరిక్ వైట్ సంచారము చేసెను. అందువల్ల చాలా ఫలితములున్నట్లు అతడు అనుభవము మీద తెలుసుకొనెను. 1921 లో రాష్ట్రీయ శాసనసభాధ్యక్షుల నందరిని సిమ్లాలో సమావేశ పరచినాడు. ఆ సమావేశములో వివిధ రాష్ట్రీయ శాసనసభల కార్యకలాపాలను సమీక్షించుకొనుట జరిగినది. తద్వారా కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలకు దగ్గర సంబంధము కుదిరినది. ఇట్టి ఉత్కృష్టమైన పద్ధతినే విఠల్ భాయ్ కూడ అనుసరించినాడు. ఒకానొక పత్రిక విమర్శించినంత మాత్రమున వచ్చినదేమి, పోయిన దేమి ?

ఈ విధముగ తన్ను అతి క్రూరముగ విమర్శించిన పత్రికాధిపతులపై గాని విలేఖరులపై గాని విఠల్ భాయ్ చూపిన క్రౌర్యమేమీ లేదు. నోటీసులు గాని, బిల్లులుగాని ఆయా పత్రికలకు పంపరాదని యుత్తరువు చేసెను. పత్రికా విలేఖరులు వాటికోసము మరల దరఖాస్తులు పెట్టుకొనవలె. ఈలోపున వారు వ్రాసిన వ్రాతలకు అధ్యక్షునకు క్షమాపణ చెప్పుకొనవలె. ఆ క్షమాపణ పత్రాలను అధ్యక్షుడు నిర్ణయించిన పత్రికలలో ప్రచురించవలె. అప్పుడుగాని వారి దరఖాస్తులను అధ్యక్షుడు మంజూరు చేయడు.

ఈవిధముగ ఎట్టి క్లిష్టపరిస్థితులు వచ్చినను విఠల్ భాయ్ తనఅధ్యక్షపీఠగౌరవమును అన్నివిధముల కాపాడుకొనెను.

**బర్డ్వుడ్ ఉపాఖ్యానము**

సర్ విలియమ్ బర్డ్వుడ్ ఇండియా సర్వ సైన్యాధ్యక్షుడు. మిలిటరీ శాఖలో ఉద్యోగాలు కావలసిన భారతీయ యువకులకు అవసరమగు విద్యావిధానమును గూర్చి స్కీన్ కమిటీ నివేదిక యొకటి తయారయ్యెను. కమిటీ నిర్ణయమును వైస్రాయి అసెంబ్లీకి ఎరుకపరచెను. తరువాత కొన్నాళ్ళకు అవిషయమై అసెంబ్లీలో అడ్జర్న్మెంటు ప్రతిపాదనమువచ్చెను. కాని ఆసమయమున సర్ విలియమ్ బర్డ్వుడ్ అసెంబ్లీకి హాజరుకాలేదు. కొన్నాళ్ళక్రితమే యాతడు పర్యటనము వెళ్ళియుండెను. బర్డ్వుడ్ స్థానే ఆర్మీసెక్రటరీ మాత్రముండెను. ఆసందర్భమున విఠల్

భాయ్ విఠ్రాయిని కూడ హాజరుకానందుకు విమర్శించి విడిచెను. బర్డ్వుడ్ పాపము తిరిగివచ్చి తనతప్పు తాను తెలుసుకొనెను.

**జమేదార్ పటేల్**

ఒకసారి ఢిల్లీ అసెంబ్లీభవనాలు చూచుటకు ఎవరో అమెరికన్ దంపతులు వచ్చినారు. వారి విజిటింగ్ కార్డులు ఎవరోతెచ్చి విఠల్ భాయ్కి ఇచ్చినారు. అతడవి చూచుకొన్నాడు. వెళ్ళి వారికి స్వాగతము చెప్పినాడు. లోనికితెచ్చి అసెంబ్లీ భవనమంతయు చూపించినాడు. ఆ యమెరికన్ దంపతులు ఆతడక్కడి జమేదారు కాబోలునని యనుకున్నారు. చివరకు పటేల్ వారినితెచ్చి అధ్యక్ష పీఠమునందు ఆసీనులను చేశాడు. శ్రమపడి తమ కాతడన్నియు చూపించినాడు కదాయని వారతని కేదో పారితోషిక మీయబోయిరి. పటేల్ పుచ్చుకొనలేదు.

అంతట పటేల్ వారిని విడిచి వెళ్ళిపోయెను. అమెరికన్ దంపతులా భవనము నందే అవియు నివియు చూచుచు, అటునిటు తిరుగు చుండిరి. వారికింతను చూపవలసినవన్నియు చూపి చివరకు తన గదిలోనికి కొని తెమ్మని పటేల్ ఒక నౌకరును అజ్ఞాపించి పంపెను.

చివరకా అమెరికన్ దంపతులాతని గదిలో ప్రవేశించి నప్పుడు వారి యాశ్చర్యమునకు, భావాసమ్యాతకు మేరలేక పోయెను. చాలనొచ్చుకున్నారు. తాము పొరపడి జమేదారు కాబోలుననుకొన్న వ్యక్తియే నా భారత ప్రభుత్వనిర్వహణ గురుతరభారవహుడు అసెంబ్లీ అధ్యక్షుడు! అట్టి వానికి అనాలోచితముగ పారి తోషకమీయబోయిన తమగర్వపాటుకు క్షమాపణ చెప్పుకొన్నారు.

**శాసన సభా బహిష్కరణము**

లాహోర్ కాంగ్రెసు సమావేశములో శాసన సభా బహిష్కరణ తీర్మానము నెగ్గెను. తరువాత కొద్దిరోజులకు 1930 జనవరి 21 తేదీన అధ్యక్షుడు విఠల్ భాయ్ అసెంబ్లీలో ఆ తీర్మానమును పురస్కరించుకొని యిట్లు ఉపన్యసించెను—

"శాసన సభలను బహిష్కరించవలసినదిగా కాంగ్రెసు తీర్మానించిన యీ సందర్భములో నాయభిప్రాయములను మీకు విశదము చేయుట నావిధియై యున్నది. అసెంబ్లీ అధ్యక్షుడుగ నా పరిస్థితులు కూడ మీకు విశదము చేయవలసియున్నది.

"ఇంగ్లండు కామన్సుసభలో 'స్పీకరు'గా ఉండదగిన వాని ప్రవర్తన మీవిధముగ నిర్వచింపబడినది: 'స్పీకర్ హోదా ఉత్కృష్ట మైనది. అట్టి హోదాను స్వీకరించువాడు అన్నిపార్టీలకు అతీతుడై ఉండవలె. చక్రవర్తికి వలె స్పీకరుకు గూడ రాజకీయము లుండరాదు. మొదట ఆతడొక పార్టీ తరఫుననే కామన్సు సభాసభ్యుడుగ ఎన్నుకొన బడును. ఒకానొక పార్టీయే అతనిని స్పీకరు పదవికి ప్రతిపాదించును. నిజమే. కానిస్పీకరుగ ఎన్నుకోబడి, తన్ను ప్రతిపాదించిన-ప్రతిపాదనను బలపరచిన- ఆయిరువురిచేతను అసెంబ్లీ బెంచీల మీదనుండి స్పీకరు కుర్చీ లోనికి జేగీయమానముగతీసుకొని పోబడు చున్నప్పుడే ఆతడు పార్టీ బంధా లను కోసివైచికొనును. రంగు రంగుల తన పార్టీ జండాను విడిచిపెట్టును. అతనిజండా ఇప్పుడుస్వచ్ఛమైన తెలుపు. రాజకీయములలో ఆతడు తట స్థుడు. అతనిని అసెంబ్లీ సభ్యులందరు ఎన్నుకొన్నట్లే. అందరిపై అతనికి సమానాధికారము ఉన్నది. స్పీకరు పదవి నధిష్ఠించిన తరువాత ఆతడిక యే పార్టీకిని చెందడు.

1923 లో అఖిలభారత కాంగ్రెసు తీర్మానము ననుసరించి కాం గ్రెసులో అంతర్భాగమైన స్వరాజ్య పార్టీ శాసనసభల యెన్నికలకు పోటీ చేసినది. ఆ పార్టీ టిక్కట్టుమీదనే నేను అసెంబ్లీ సభ్యుడ నైనాను. 1924 లో ఇక్కడ నా స్థానం ఆక్రమించినాను. 1925 లో ఆగష్టులో అసెంబ్లీలోని స్వరాజ్య పార్టీ సభ్యులు నన్ను అధ్యక్ష పదవికి ప్రతిపాదించినారు. ఎన్నుకోబడినాను. ఆ క్షణమునే నేను చెప్పు కొన్నాను- 'ఇప్పుడు నేను ఏ రాజకీయ పార్టీకి చెందను. అన్ని పార్టీ లకు చెందిన వాడనే. నేనిప్పుడు మీ యందరివాడను. వెంటనే స్వరాజ్య పార్టీ నాయకుడు పార్టీలోనించి నా పేరు తీసివేయించుటకు ప్రయత్నిం చును గాక!' అని.

1926 మార్చిలో స్వరాజ్యపార్టీవారు అసెంబ్లీలోనించి నిరసన సూచకంగా బైటకి నడచి పోయినారు. నేను పూర్వము స్వరాజ్యపార్టీ వాడనే. ఆ పార్టీ టిక్కట్టుమీదనే అసెంబ్లీ సభ్యుడుగా వచ్చినాను. కాబట్టి నేనుకూడ వారితో పాటు బైటికి పోదునని కొందరు సభ్యులు అనించియుందురు. నేనాపని చేయలేదు. కామన్సు సభలో స్పీకరువలె అసెంబ్లీ అధ్యక్షుడు కూడ అన్ని పార్టీలకు అతీతుడై యుండవలసినదే నన్న నియమమును నేను పాటించినాను.

1926 సంవత్సరాంతమున మరల ఎన్నికలు ఆరంభమయ్యెను. నేను నిల్చిన నియోజక వర్గంలో ఒక కాంగ్రెసు అభ్యర్థిని నిలుపుటకు ప్రయత్నాలు జరిగినవి, కానీ, కాంగ్రెసు అభ్యర్థిగా నన్నే నిలవమన్నారు. కాని-మరల అసెంబ్లీ అధ్యక్షుడుగా (ఎన్నుకోబడి నట్టయితే) కొంత సేవ చేయదలుచుకొని యున్నాను కాబట్టి తరువాత అవసరమైన అపోహలకు తావు లేకుండ నుండగలందులకై నేనప్పుడు స్వతంత్ర అభ్యర్థిగనే నిల్చినాను. పోటీ లేకుండనే అసెంబ్లీ సభ్యత్వము లభించినది.

కాంగ్రెసుపార్టీ నాయకుడే నన్ను అధ్యక్షపదవికి ప్రతిపాదించినాడు. ఏకగ్రీవముగ నేను ఎన్నుకోబడినాను. అప్పుడు నేను చెప్పినమాటలివి: 'అసెంబ్లీ అధ్యక్షుడుగ నా పూర్వానుభవాన్ని బట్టి యీపదవి నధిష్టించినవ్యక్తి తనబాధ్యతలను సక్రమముగ, విజయవంతముగ నిర్వహించవలెనన్న తన స్వార్థ ఆశయములను, పార్టీ పక్షపాతమును, ప్రత్యేక రాజకీయ దృక్పథమును విడిచిపెట్టి, అసెంబ్లీలోని అన్నిపార్టీల వారియెడ సమరసభావమున మెలగుచు వ్యవహరింపవలెనని నేను కనిపెట్టితిని. ఎట్టివాడైనను తన వ్యక్తిగత సంస్కారాలను, పార్టీ ప్రభావమును త్రెంచి వైచికొనలేడు; నిజమే. కాని అతని వ్యక్తిగతాభిప్రాయము లెట్టివైనను, అభిమాన మేపార్టీపై నున్నను...తన తీర్పులలో, నిర్ణయాలలో, అసెంబ్లీ సభ్యులతోటి సంబంధ బాంధవ్యాలలో అవి ప్రతిఫలింరాదు. ఇతఃపూర్వము నేనా ఆశయమునకు అనుగుణ్యముగ ప్రవర్తించినానో లేదో నాకు తెలియదు. ఇకముందైనను అట్లు వ్యవహరింప గలుగుదునో, లేనో చెప్పలేను. కాని ఆయాశయమును సదా జ్ఞప్తియందుంచుకుని తదనుగుణ్యముగ నా అధ్యక్ష బాధ్యతలను నిర్వహించుటకు ప్రయత్నింతునని వాగ్దానము చేయుచున్నాను.'

ఇప్పుడు లాహోరు కాంగ్రెసు తీర్మానము వినవచ్చినది. ఈయదనున నేనేమి చేయనున్నానో తెలుసుకొనుటకు చాలమంది మిత్రులు ఉత్సుకులైయున్నారు. ఈవిషయమై ఎవరికి వారు తోచిన రీతిని ఊహాగానములు చేయకుండ నుండగలందులకై నేనీ నాడీప్రకటనము చేయుచున్నాను. అసెంబ్లీ అధ్యక్షుడు అన్నిపార్టీలకు అతీతుడన్న విషయము మీకు మరొకసారి జ్ఞాపకము చేయుచున్నాను. అసెంబ్లీ సభ్యులందరు అతనిని విశ్వసించి యుందురు. అట్టి యెడ ఏదో ఒకపార్టీ

నిర్ణయమును పురస్కరించుకొని అధ్యక్షుడు తత్ప్రకారము ప్రవర్తించి నట్లయితే అసెంబ్లీ సభ్యుల కాతడు విశ్వాసపాత్రుడు కాజాలడు.

ఇటువంటి పరిస్థితులలో కాంగ్రెసు నిర్ణయమును పాటించి నేనీ అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చితి నేని ఈనాలుగు సంవత్సరాల నుండి నేను కావించిన కృషియంతయు నిష్ప్రయోజనమై పోవును. 'అసెంబ్లీలో ఇక కాంగ్రెసుపార్టీ ఉండదు కదా! ఇక నీవేమి చేయగలవు?' అని కొందరి సవాలు. కాంగ్రెసు పార్టీ అసెంబ్లీలో లేక పోయినందున నా కార్యకలాపమునకు ఆటంకమేర్పడు నన్నమాట నేను విశ్వసించను. ఇంకను ఇతరపార్టీలవారు ఉన్నారు. కాంగ్రెసువారి స్థానములలో మరెవరో వచ్చెదరు. వారందరి విశ్వాసమును, సహాయసంపత్తులను పూర్వమువలెనే బడయగల నని నానమ్మకము. పార్టీ వైషమ్యాలు లేక, నిష్పాక్షికంగా నేను వ్యవహరించితినేని వారి విశ్వాసము కరతలామలకమే. కాని అట్లు నేను వ్యవహరించుటకు వీలుగాని పరిస్థితు లేర్పడినప్పుడు - ఆమరుక్షణమే మీరు నన్నీ పీఠంలో చూడరు.

కనుక అసెంబ్లీ ప్రెసిడెంటు ఒకానొక ప్రత్యేక పార్టీ నిర్ణయానికి బద్ధుడై ప్రవర్తించుట తప్పు. కాని భారతదేశ పరిస్థితులు మీ రెరిగి యున్నారు. ఎన్నటికైనను యావద్భారత దేశక్షేమానికై మరొక విశాలాశయం పురస్కరించుకుని అధ్యక్షుడు రాజీనామా దాఖలు చేసుకొను సమయము వచ్చిన రావచ్చును.

బ్రిటిష్ ప్రభుత్వము సైమన్‌కమిషన్‌ను నియమించి నప్పుడు, అద్దానిని బహిష్కరించుటకే యావద్భారతదేశము నిశ్చయించి నప్పుడు అట్టి సమయ మేతెంచెననియే నేను భావించితిని. ఆ బహిష్కరణోద్యమములో పాల్గొను నిమిత్తమై యీ పదవికిని రాజీనామా పెట్టనా? వద్దా? యని అప్పుడు తీవ్రముగ ఆలోచించితిని. కాని ఈ యుద్యోగములో నుండియే నేను దేశమునకు ఎక్కువ సేవచేయగలుగుదు నని మిత్రులు సలహా యిచ్చినారు. వారి సలహా ననుసరించియే నేనప్పుడు వార్తాపత్రికలలో ఒక ప్రకటనము చేసితిని. దేశ పరిస్థితుల విషయమటు ఉండనీయుండి. అనేకసార్లు ప్రభుత్వముతో నాకు తీవ్రతరములైన భేదాభిప్రాయములు పొడసూపు చుండినప్పుడెల్ల ఈపదవికి రాజీనామా పెట్టివేయుదునా యనిపించెడిది. కాని అసెంబ్లీ సభ్యుల విశ్వాసము చూరగొనుచుండినంత కాలము—ఏదైనా ఒకపార్టీ నా ప్రవర్తనము నెడ అసంతృప్తిపడి విశ్వాసరాహిత్య తీర్మానము ప్రవేశపెట్టునంతవరకు —

నేను ఉద్యోగము విడిచిపెట్టరాదని మిత్రులు సలహా లిచ్చుచుండెడి వారు. అనేక పర్యాయములు ప్రభుత్వమునకును, నాకును భేదాభిప్రాయములు సంభవించినప్పుడెల్ల ఇర్విన్‌ప్రభువు జోక్యము కలిగించుకొని సమంజసముగ, సామరస్యముగ వ్యవహరించియుండక పోయినచో నేనెప్పుడో ఈపదవినుంచి విరమించి యుండెడివాడను.

ప్రస్తుత దేశపరిస్థితులు జాగ్రతగ పర్యవేక్షించినాను. లాహోరు కాంగ్రెసు తీర్మానమును పరిశీలించినాను. ఈ పదవిని వీడకుండ నుండుటయే సమంజసమని నేను నిర్ణయించు కున్నాను.

"కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యమును వాంఛించు చున్నది. భారతదేశము అధినివేశ ప్రతిపత్తికి అర్హత కలిగియున్నదని బ్రిటన్ సర్తించవలె. భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తి ప్రసాదించు విధానమును గూర్చి రెండుదేశాల రాజకీయ ధురంధురులు సమావేశమై చర్చించుకోవలె. అప్పుడుగాని బ్రిటన్ ఇండియాల విభేదాలు తొలిగిపోయి బాంధవ్యము స్థిరపడదు. అని ఈ నా నిశ్చితాభిప్రాయమును, నే నీ యుద్యోగము నిర్వహించుచున్న నాలుగేండ్ల నుండియు అవకాశము లభించినపుడెల్ల ఇండియా ప్రభుత్వపు పెద్దలకు తెలియజేయుచునే యున్నాను. వైస్రాయి ప్రకటనము ఇరుదేశముల మధ్య సుహృద్భావము పెంపొందించుటకే యుద్దేశింపబడినట్లు నా నమ్మకము. కాని ఆ ప్రకటనములో ప్రజలు సంతుష్టులు కాలేదు. కాంగ్రెసు బలము అపారము. కాంగ్రెసుకు ప్రభుత్వమునకు సామరస్యము కూర్చుటకు నా శాయశక్తుల ప్రయత్నించినాను. కాని విఫలుడ నైనాను. ఇప్పటికీ మించిపోయినది లేదు. ఇట్టి పరిస్థితులలో నేనీ ఉద్యోగమున నుండియే చేతనైనంత వరకు దేశసేవ చేయవలెనని నా ఆశయము."

---

# 5

## ప్రెసిడెంటు పటేలు రాజీనామా

1930 ఏప్రియల్ 25 తేదీని విఠల్‌భాయ్ పటేల్ తన అసెంబ్లీ అధ్యక్షపదవికి రాజీనామా యిచ్చినాడు. ఇచ్చి భారత స్వాతంత్ర్యోద్యమములో నడుము బిగించి దుమికినాడు. తాను రాజీనామా యిచ్చుటకు కారణములు తెలుపుచు అతడు వైస్రాయికి ఇట్లు లేఖవ్రాసెను-

డియర్ లార్డు ఇర్విన్! నా అసెంబ్లీ ప్రెసిడెంటుపదవికి, అసెంబ్లీ సభ్యత్వానికీ ఇదే రాజీనామా దాఖలుచేసుకొను చున్నాను. ఈ సందర్భమున ... మొదటిసారిగ ప్రజలచే ఎన్నుకొనబడిన అసెంబ్లీ అధ్యక్షుడు తన విధినిర్వహణలో ఎన్నికష్టాలు, ఆటంకాలు ఎదుర్కొనవలసి యుండునో తమకు మనవిచేసెదను. ఇప్పుడునేను రాజీనామా యిచ్చుటకు తగిన కారణాలుకూడ నివేదించెదను.

"నేను 1925 ఆగస్టునుంచి ఈపదవిలో ఉన్నాను. ఎట్టిపార్టీ పక్షపాతమును లేక స్వతంత్రముగనే వ్యవహరించినాను. ప్రజల పొగడ్తలను నేను కాంక్షించలేదు. ప్రభుత్వము వారి ఆగ్రహమునకు నేను వెరవలేదు. నేను కొన్ని పొరపాట్లు చేసియుండ వచ్చును. కాని నా మాటలలో గాని, చేతలలో గాని నా వ్యక్తిగత రాజకీయ దృక్పథముతో నే నెన్నడును వ్యవహరించలేదు. దేశములోని, అసెంబ్లీలోని వివిధ పక్షాలను సంప్రదించిన మీదటనే నేను ఒక నిర్ణయమునకు వచ్చుచుండెడివాడను.

అతిక్లిష్ట తరములైన సమస్యల సందర్భమున గూడ నేనట్లు నిష్పాక్షికముగ, స్వతంత్రముగ ప్రవర్తించి నందుననే ప్రభుత్వ కోపమునకు గురియైనాను. ప్రభుత్వము వారు చాల వరకు సహించి యూరకున్నారు. కాని వారికి సంబంధించిన విషయాలలో మాత్రము నా నిష్పాక్షికపు తీర్పులను సహించలేక పోయినారు. చక్రవర్తి ప్రభుత్వము సాగిపోవలె. ఆ నిరంకుశత్వము నిరాటంకముగ సాగిపోవునట్లుగనే అసెంబ్లీ

అధ్యక్షుడు ప్రవర్తించవలె అని వారి యూహ. నే నందుకు లొంగిపో లేదు. ఒక్కొక్క విషయము వారి దృష్ట్యా అత్యంత ప్రముఖమైనదై యుండవచ్చును. అయినను దాని పరిష్కార సందర్భమునందు కూడ నేను వారి పక్షమే వహించి, వారి నౌకరువలె ప్రవర్తించలేదు. తత్ఫలిత ముగా ఈమూడు సంవత్సరములనుండియు ప్రభుత్వమునకును, నాకును ఒక విధమైన ద్వంద్వయుద్ధమే సాగుచువచ్చినది. ఈ అధ్యక్షపీఠము నాకొక ముండ్లపాదరక్షయైనది. వారు అధ్యక్షుని బహిష్కరించు ప్రయత్నములుకూడ చేసినారు. వార్తాపత్రికలద్వారా అతనిపై క్రూరాతి క్రూరములగు వాగ్బాణములను కూడా విసిరినారు.

నేనేమి ప్రతీకారము చేయగలను? అందుచేత సహించి యూరకొన్నాను. అప్పుడప్పుడు కొన్ని సమయాలలో మిమ్ములను కలుసుకొని, మీతో నా హృదయము విప్పి చెప్పుకొనుచుండెడి వాడను. అంతకన్న నాకు మనశ్శాంతి కరమగు మార్గము వేరు లేకపోయెను. అసెంబ్లీ అధ్యక్షుని అధికారాలు గాని, అసెంబ్లీ గౌరవ ప్రతిష్ఠలుగాని వారు లెక్క చేయరాయెను. ఒక్కొక్కప్పుడు అధ్యక్షుని ప్రజలదృష్టిలో కించపరచుటకు కూడ వారు వెనుకాడలేదు.

అంతమాత్రముతో వారు ఊరుకోలేదు. నాపై దుష్ప్రచారము చేయుటకు, ప్రజలలో నన్ను నిందా పాత్రుని చేయుటకు పనిపెట్టుకొన్న యొక ముఠా తయారైనది. దాని కార్యక్రమములో ప్రధానాంశము నాపై మీకు ద్వేషము పుట్టించుట. ఇందులో వారెంతవరకు కృతార్థులైనారో నేను చెప్ప నక్కరలేదు.

కొందరు పత్రికా విలేఖరులు తరుచు ఆ ముఠాను సందర్శించి పోవుచుండెడివారు. ఆ ముఠావారిని తగినట్లు ప్రోత్సహించెడివారు. వారు తమ పత్రికలలో నన్నుగూర్చి యిచ్చవచ్చినట్లు వ్రాసెడివారు. వీరి దుష్ప్రచార మీ విధముగ శ్రుతిమించి సాగినది. రాజధానిలోనే కాదు, భారతదేశమం దెక్కడైనను నివసించుచుండు తెల్లవానికి నాపై ఏవగింపు కలిగి 'వీ డెప్పుడు అసెంబ్లీ నుండి తొలగిపోవునా' యని యనుకొనునట్లు వారు తమ శాయశక్తుల నాపై దుష్ప్రచారము చేసినారు.

ఈసందర్భములో వారునన్ను అవమానము పొంచి కనిపెట్టు చునే యుండిరి. ఇట్లు అనేకవిధముల నన్ను బాధించి, విసిగించి నాచేతనే అధ్యక్షపదవికి రాజీనామా యిప్పించవలెనని వారియుద్దేశము కాబోలును! నేను రాజీనామాయిచ్చి వెళ్ళిపోయిన తరువాత 'భారతీయులు

అసెంబ్లీ అధ్యక్షపదవివంటి బాధ్యతాయుత ఉద్యోగాలను నిర్వహించు టకు అనర్హులని ప్రచారము చేయుట వారి లక్ష్యము కాబోలును! ఇండియా ప్రభుత్వమునకుగాని, ప్రభుత్వోద్యోగులకు గాని నాపై కించిత్తుకూడ ఆదరము లేదన్న సంగతి నగ్నసత్యమే. విశ్వాసరాహిత్య తీర్మానము నెగ్గినచో నేనాపీఠము దిగవలసియుండెను. మరి వేరుమార్గము లేదు. అందుచేత వారు తప్పనిసరిగ సహించినారు. నాపై విశ్వాసరాహిత్య తీర్మానము ప్రవేశబెట్టి నెగ్గించుకొనుట వారికి చేతకాదాయెను.

ఇన్ని కష్టములు ఉండినను నేను నిభాయించుకొని నిల్చినాను. ఆ యుద్యోగ బాధ్యతలు నిర్వహించుచు నాదేశమునకు కొంతసేవ చేయగలుగు చున్నానని నేను నమ్మినాను. అదృష్టవశాత్తు తీవ్రతర భేదాభిప్రాయములు పొడసూపిన సమస్యలలో నాదే పైచేయియైనది. వారు వీగిపోయినారు. నరాలపటుత్వం సరిగా లేనివాడైతే ఏనాడో పదవికి రాజీనామాయిచ్చి పారిపోయేవాడు; లేదా వారి యిష్టప్రకారమే నడుస్తూ ఉద్యోగం నిలుపుకొనేవాడు. నేనుమాత్రము ఆ రెండుపనులు చేయలేదు. ధైర్యముగ, న్యాయబద్ధముగ వ్యవహరించినాను. అవసరమని తోచినప్పుడు 'రూలింగ్' లు జారీచేసినాను. అవి ప్రపంచములో ఏ అసెంబ్లీకైనను గౌరవప్రదములని నావిశ్వాసము.

నేనీ యుద్యోగపీఠ మధిష్టించి యుండినంతకాలము ప్రభుత్వ మునకును, అసెంబ్లీకిని నిరంతరసంఘర్షణము సాగుచునే వచ్చెను. నేను ప్రతివిషయమునందును అధ్యక్షపీఠ గౌరవమును, అసెంబ్లీ సభ్యుల హక్కులను ఈ నిరంకుశ ప్రభుత్వమునుండి రక్షించుటకే ప్రయత్నించి నాను. నా ప్రయత్నములు ముప్పాతిక మువ్వీసము ఫలించినవి. ఈ అయిదు సంవత్సరములును ఎంతో మానసిక శ్రమ యనుభవించినాను. నాయారో గ్యము కూడ చెడినది. ఇప్పటికి ప్రజల విశ్వాసము చూరగొనుచున్నా నన్నది ఒక్కటే నాకు ఓదార్పు. వ్యక్తినిగాని, వ్యక్తులనుగాని నేను నిందించుటలేదు. పైని ఉదహరించిన అక్రమ చర్యలు జరిగిన విధానమును నేను గర్హించుచున్నాను. అట్టి విధానము అవశ్యము అంతరింపవలెనని నా కోరిక.

ఎన్నికష్టములు వచ్చినను, ఎన్ని యిబ్బందులు పడుచున్నను, ఎవరెట్లు పీడించినను ఈ అధ్యక్ష పదవియందుండి నే నేదేని దేశసేవ చేయగలనన్న విశ్వాసముండినచో ఈ యుద్యోగము విడిచి పెట్టువాడను

కాను. కాని పరిస్థితులు మారినవి. ఇంకను నేనీ పీఠమధిష్టించి ప్రయోజనము లేదు.

లాహోరు కాంగ్రెసు సమావేశములో శాసన సభా బహిష్కార తీర్మానము నెగ్గినది. శాసన సభలు ఖాళీచేసి కాంగ్రెసు ప్రతినిధులు వెళ్ళిపోయినారు. అసెంబ్లీలో సభ్యుల కయిష్టముగ 'ఇంపీరియల్ ప్రిఫరెన్సు' సిద్ధాంతమును ఇండియా ప్రభుత్వము ప్రవేశపెట్టినందుకు నిరసన సూచకముగా అసెంబ్లి వ్యతిరేక పక్ష నాయకుడు పండిట్ మదనమోహన మాలవీయ, అతని యనుచరులు రాజీనామాలిచ్చి తొలగిపోయినారు. ఇక నది ప్రజాప్రతినిధుల అసెంబ్లీ అనిపించుకోదు.

టారిఫ్ బిల్లు చర్చకు వచ్చినది. బ్రిటిష్‌వారి ప్రత్యేక హక్కులు అసెంబ్లి అంగీకరించవలసినదే, లేదా ఇండియాలో మిల్లు పరిశ్రమ నాశనమై పోవలసినదే అన్న పద్ధతిలో ఇండియా ప్రభుత్వము ప్రవర్తించినది. అట్లయితే గవర్నమెంటు ప్రతిపాదనలకు ఇష్టము లేకపోయినను బలవంతముగ సభ్యులు వాటిని సమర్థించుచు వోటు చేయవలసి వచ్చుచున్నది. ఆ ప్రతిపాదనల సామంజస్యము చూడ నక్కరలేదన్న మాట! ఇవే మాటలు ప్రతి సభ్యుడును బిలుపై మాటాడుచు చెప్పినాడు. గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టు ప్రకారము వోటు స్వాతంత్ర్యము ఉన్నది. కనీసము ఆ హక్కును కూడ కాపాడలేక పోయిన తరువాత నేనింకను ఈ అధ్యక్ష పీఠముపై కూర్చొని యేమిలాభ మనిపించింది.

అనగా ఇకమీద వైస్రాయి కార్య నిర్వాహక వర్గమువారు ప్రతిపాదించిన చట్టాలను అసెంబ్లి కిష్టమనకుండ ఆమోదించవలెనన్నమాట! అట్టి అసెంబ్లీకి అధ్యక్షుడనై యుండి నేను నాదేశమునకు సేవకాదు, హాని చేయుచున్నా ననిపించినది.

అదియుగాక ప్రస్తుతము దేశములో తీవ్రపరిస్థితులు రేగినవి. ఇంకను ఈ ప్రెసిడెంటు పదవినే అంటిపెట్టుకుని, చేతులు ముడిచిపెట్టుకుని యుంటినేని భారత స్వాతంత్ర్యోద్యమమునకు లీరని యపచారము చేసినవాడ నయ్యెదను.

1930 జనవరి 21 తేదీని నేను లాహోరు కాంగ్రెసు తీర్మానమును పురస్కరించుకొని— "అసెంబ్లీ ప్రెసిడెంటు ఒకానొక ప్రత్యేక పార్టీ నిర్ణయానికి బద్ధుడై ప్రవర్తించుట తప్పు, అపాయకరము. కాని భారతదేశ పరిస్థితులు మారిపోయియున్నారు. ఎన్నటికైనను యావద్భారత

దేశక్షేమానికై ఒక విశాలాశయం పురస్కరించుకొని అధ్యక్షుడు రాజీనామా దాఖలుచేసుకొను సమయము రావచ్చును" - అని చెప్పి యున్నాను. నిస్సందేహముగా అట్టిసమయ మిప్పుడేతెంచినదని నాపూర్తి విశ్వాసము.

"యశోవా మృత్యుర్వా" అనుకొని నాప్రజలు స్వాతంత్ర్య సమరోన్ముఖులైనారు. అధునిక యుగపురుషుడు మహాత్మగాంధీ నాయకత్వమున అఖిలభారత జాతీయ కాంగ్రెసు కొనసాగించుచున్న అహింసాయుత సహాయనిరాకరణ శాసనోల్లంఘనోద్యమాలు జేగీయమానముగ సాగుచున్నవి. వందలకొలది నాదేశీయులు ప్రముఖవ్యక్తులు అప్పుడే చక్రవర్తి కారాగారములను అలంకరించినారు. ఇంకను వేలకొలదిగ జైళ్ళను వరింపనున్నారు. ఈ తరుణమున నేను నాదేశీయులతో భుజము లొరసి నిలువ వలసి యున్నది. అంతేగాని ఈ అధ్యక్షపీఠమున నుండతగదు.

దేశములో ఇంత తీవ్ర పరిస్థితు లేర్పడ కుండ తమరు ఇక్కడ పైస్థాయిగ నుండిన ఈ నాలుగేండ్లనుండియు ఇరుపక్షముల వారికి సామరస్యము కుదుర్చుటకై యొక విధముగ ప్రయత్నించుచునే యున్నాను. మీ కా విషయము తెలిసియే యున్నది. ఇండియాకు అధినివేశ ప్రతిపత్తి నిచ్చుటకు బ్రిటన్ తీర్మానించి - ఆ తీర్మానము నాచరణలో పెట్టుటకై ఇండియా- బ్రిటన్ దేశాల రాజకీయ ధురంధరులు సమావేశమై చర్చించుకొనవలెనని నేను పలుసార్లు విన్నవించుకొన్నాను. అట్లు జరిగించినచో ఇట్టి తీవ్ర సంచలనము జరుగకుండ నుండగలదని నే నాశించితిని.

చాల కాలమువరకు నే నేవో యాశలతోనే యుంటిని. బ్రిటిష్ కామన్వెల్తులో ఇండియా స్వపరిపాలన మనుభవించుచు సుఖింపగలదని భావించితిని. దేశీయుల కష్టాలిక గట్టెక్క గలవని యనుకున్నాను. కాని ఇండియాలోను ఇంగ్లండులోను ఇటీవల జరిగిన సంఘటనలతో నాయాశలు అడియాసలయ్యెను. ఈనాడు బ్రిటిష్‌వారిలో హృదయపరివర్తనము రాగలదన్న మాట - నిరంకుశ బ్రిటిష్ పరిపాలనా విధానంలో మార్పు రాగలదన్న మాట - బ్రిటిష్‌వారు ఇండియాకు అధినివేశప్రతిపత్తి ఇచ్చెదరన్న మాట - ఈ మాటలన్నియు నీళ్ళలో మూటలని నిశ్చయించుకొన్నాను.

కాంగ్రెసు కోరికలు సమంజసములని మన్నించు ఉద్దేశము బ్రిటిష్ ప్రభుత్వమునకు లేదు. ఇండియా సమస్య తృప్తికరముగ పరిష్క

రించి ఇండియా బ్రిటన్ ఇరుదేశాల వారికీ క్షేమము కూర్చవలెనన్న యాతురతకూడ లేవాయెను. పైగా భారతీయుల న్యాయబద్ధమగు వాంఛను అణగద్రొక్కుటకు ప్రయత్నించుచున్నారు. ఇందుకు వారనుస రించుచున్న మన నీతియే ప్రబలసాక్ష్యము. అందుకనియే భారతదేశమునకు అధీనదేశ ప్రతిపత్తిని ఇచ్చెదమని బ్రిటిష్ ప్రభుత్వము ప్రకటించిననే తప్ప రౌండుటేబిల్ సమావేశములో పాల్గొన వలదని కాంగ్రెస్‌వను గాంధీజీ సలహా యిచ్చినాడు. భారతదేశమున కధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించు ఆచరణ విధానములను చర్చించు నిమిత్తమే రౌండుటేబిల్ సభ జరుగవలెనని మహాత్ముడు ఉద్ఘాటించెను. ఆయన వాదన సమంజసముగ నున్నది.

కనుక ఇట్టి పరిస్థితులలో నా యధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చి, ప్రభుత్వములో నాకుగల సంబంధ బాంధవ్యాలను త్రెంచుకొని పోయి భారతస్వాతంత్ర్య సమరాన నాదేశీయుల పక్షము వహించెదను. అదియే నేననుసరింపదగిన, ఉదాత్తమైన, దేశభక్తి ప్రబోధితమైన భవిష్యత్కార్యక్రమము. నా యనారోగ్యము నేనీ యుద్యమములో పాల్గొనుటకు ఆటంకము గాకుండ గాక! ఏదియెట్లైనను ఈ నాపదవికి రాజీనామా యిచ్చుటచేత భారత ప్రజోద్యమమునకు నైతికముగ నైన చేయూత ఇవ్వగలుగుచున్నాను.

నేనీ యుద్యోగములో నుండినంతకాలము మీరు నాయెడ స్నేహభావముతో మెలగినారు. అప్పుడప్పుడు ఉచితములైన సలహాలిచ్చుచు వచ్చినారు; ఎంతయు దయతో నన్ను ఆదరించినారు. అందుకు మీకు నా కృతజ్ఞతాభివందనాలు. మీ ఆదరాభిమానాలను నేను మరచిపోను.

నేనీ యుద్యోగము నందుండిన కాలములో నా నియోజకమున చాలకష్టతరమగు పరిస్థితులేర్పడెను. 1927 లో వరదల మూలమున చాల నష్టముకలిగినది. అప్పుడు మీరు నాప్రార్థన మంగీకరించి, యా ప్రాంతములకు స్వయముగా వెళ్ళిచూచి, ప్రజలగోడు ఆలకించి వారిని ఓదార్చి వచ్చినారు. 1928 లో బార్డోలీ తాలూకాలో శిస్తు లధికము చేసినప్పుడు అక్కడ ప్రమాద పరిస్థితులేర్పడెను. ఆ తరుణమున తమరు నామాటమన్నించి బొంబాయి ప్రభుత్వమునకు ఉచితములగు సలహాలిచ్చి పరిస్థితులను చక్కబరచినారు.

"నేటితో తమకును నాకునుగల ఈ యుద్యోగ సంబంధమగు బాంధవ్యము తీరిపోయినది. అయినను మనమాట్లు వ్యక్తిగతస్నేహమునకు మాత్రము భంగములేదు. అనధికార హోదాలో మరల తమ్మొకసారి కలసికొనగలనని యాశించుచున్నాను."

**వైస్రాయి తిరుగు జాబు**

వైస్రాయి ప్రెసిడెంటు పటేల్ రాజీనామాను అంగీకరించెను. పటేల్ రాజీనామా ఉత్తరమందిన మరునాడే ఇర్విన్ ప్రభువు తిరుగుజాబొకటి అతి సంక్షిప్తముగ వ్రాసి పంపెను. బార్డోలీ సత్యాగ్రహ సందర్భమున ఇండియా ప్రభుత్వము తన సలహా పురస్కరించుకుని వ్యవహరించినట్లు పటేల్ భావించుట అపోహ యని ఆయుత్తరములో వైస్రాయి సూచించెను. పటేల్, అతని దేశీయులు శాంతియుతముగ బ్రిటిష్ ప్రభుత్వముతో సంప్రదించుకొనుట మాని, అపాయకరమగు శాసనోల్లంఘనోద్యమమును లేవదీయుచున్నారనెను. అందుకు వారు ముమ్ముందు విచారించవలసి వచ్చుననికూడ సూచించెను.

**ప్రెసిడెంటు పటేల్ రెండవలేఖ**

తరువాత ప్రెసిడెంటు పటేల్ ఇర్విన్ ప్రభువుకు మరొక దీర్ఘమైన లేఖ నంపెను. ఇర్విన్ ప్రభువు బొంబాయిలో దిగినప్పుడు విఠల్ భాయ్ అతనితో చాలసేపు సంభాషించినాడు. ఈ యుత్తరములో ఆ సంఘటనము జ్ఞాపకముచేయుచు అతడిట్లు వ్రాసెను—

"1920 లో సాగిన సహాయనిరాకరణ మహోద్యమమును గూర్చి మీకు నేను విపులముగా చెప్పినాను. అది విజయవంతముగ సాగినది; కాని చివరకు విజయము లభించలేదు. ఆయుద్యమము నిష్ఫలమైననేమి? భారతీయులందరకు ప్రాతినిధ్యము వహించినసంస్థ కాంగ్రెసు. భారత రాజకీయాలలో గాంధిజీ ఒకధృవతార. మంచి యదనున కెదురుచూచుచున్నాడు. భారతదేశమున కతడు ఏకైకనాయకుడు. ఎట్టి ప్రజాయుద్యమమునైన లేవదీసి నిర్వహించగల సమర్థుడు. అట్టి మహాపురుషునితో సంప్రదించి, సత్వరమే ఇండియాసమస్యను పరిష్కరింప వలసిన యావశ్యకతను తమ కెరుకపరచినాను.

అప్పుడు మీరీదేశమునకు కొత్తగా దయచేసినారు. పరిస్థితులు బాగుగ ఎరుగరు. అందుచేత మీకే యభిప్రాయమును ఖండించలేదు.

తరువాత మీరు మీ ప్రభుత్వ సలహాదారులను, సివిల్ ఉద్యోగులను సంప్రదించినారు. వారందరు మీకు వంతపాట పాడేవారే. ఆ తరువాత దేశములోని వివిధపక్ష నాయకులను చాలమందిని చూచారు. గాంధీజీ అనుచరులైన కాంగ్రెసు వారితో మాత్రం మీరు సంప్రదించినారు గాదు.

తరువాత మీ - నా సంభాషణలలో అనేక పర్యాయములు గాంధిజీ రాజకీయ ధౌరంధర్యమును, కాంగ్రెసు శక్తిని శంకించినారు. మీరు నా సలహాలు మన్నించక, తప్పుడు సలహాలకు చెవియొగ్గు చున్నారని నేను గమనించితిని. గాంధీజీ చిరకాలములోనే ఒక బ్రహ్మాండ మైన ప్రజాయుద్యమమును లేవదీయ గలడనియు, అప్పుడుమీరు దమన నీతి ననుసరించుట మీకే అనిష్టదాయకమనియు ఖచ్చితముగ చెప్పినాను. అట్టి యుచితమైన సలహా మీకు మరెవ్వరును ఇచ్చియుండరు. కాని మీ రప్పుడు నా మాట మన్నించు స్థితిలో లేరు.

1927 లో నేను ఇంగ్లండు వెళ్ళినప్పుడు చక్రవర్తితోను, బర్కిన్ హెడ్ ప్రభువుతోను, ఇంకను తదితర రాజకీయ ప్రభృతుల తోను అవే మాటలు చెప్పినాను. బర్కిన్ హెడ్ ప్రభువుతో భారత రాజకీయ సంస్కరణలు గూర్చి ముచ్చటించుచు - ఇండియాలో సత్వరమే బాధ్యతాయుత స్వపరిపాలనము నెలకొల్పవలెననియు, అట్లుచేయనిచో పరిస్థితులు మరింతగ విషమించి ఇరుదేశాల సంబంధ బాంధవ్యములు చెడి పోవుననియు నొక్కి చెప్పితిని. అప్పుడాతడు ఇండియా రక్షణ విష యమై కొన్ని యిబ్బందులు సూచించినాడు. అందుకు నేను సమాధానముగ 'పోనీ' బ్రిటిష్‌వారు మాకు కొన్ని షరతులమీద కొందరు ఉద్యోగు లను కొంతకాలము వరకు ఇవ్వకూడదా? అప్పుడు రక్షణవిషయమైన యిబ్బందులు తొలగిపోవును కదా!" అన్నాను. వెంటనే కాంగ్రెస్‌కు తృప్తికరముగ భారతదేశ సమస్యను పరిష్కరించక పోయినట్లయితే 1930 లో మరల 1920 నాటి విషమ పరిస్థితు లేర్పడి తీరునని జోస్యము కూడ చెప్పివచ్చినాను.

ఇంగ్లండునుంచి తిరిగి వచ్చినమీదట ఆ విషయములే మరల మీకుగూడ నివేదించినాను. తరువాత మూడు నెలలకు బ్రిటిష్ ప్రభుత్వము 'సైమన్ కమిషన్' ను నియమించినట్లు తెలిసినది. నేను బాధపడినాను. ఆశ్చర్యపోయినాను. నా సలహాలన్నియు బూడిదపోసిన పన్నీరయ్యె కదా యని విచారించినాను.

యావత్భారతదేశము 'సైమన్' ను బహిష్కరించుటకే నిశ్చయించినది. నేనుకూడ నా అసెంబ్లీ అధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చి నా దేశీయులతో చేరి ఆ యుద్యమములో పాల్గొందా మనుకున్నాను. వచ్చి మిమ్ములను - ప్రైవేటు హోదాలో గాకుండ మిత్రుడుగ సలహా యడిగినాను. అట్లు చేయవలదని మీరు నాకు సలహా యిచ్చినారు. మీ సలహా ప్రకారమే నేను నడచుకొన్నాను.

కాని దేశములో ఆ బహిష్కార ణోద్యమము విజయోపేతముగ సాగినది. అప్పుడుగాని మీకు...... నే నిన్నాళ్ళనుండియు చెప్పుచుండిన మాటలలో ఏదో సత్యమున్నదని మీకు స్ఫురించలేదు. వెంటనే మీరు ఇంగ్లండునకు ప్రయాణము కట్టినారు - ఇండియా పరిస్థితులను బ్రిటిష్ ప్రభుత్వమునకు తెలియజెప్పుటకు.

ఆ మీ ఇంగ్లండు ప్రయాణమువల్ల కొంత మేలు ఒనగూడునేమో యని ఆసించినాను. భారతీయుల న్యాయబద్ధమగు వాంఛలు మీరు మన్నింతు రనుకొన్నాను. మాతృభారతి తపస్సు ఫలించి, కష్టాలు తీరెడే రునని భావించాను. కాని మీశక్తి సామర్థ్యాలను, ఇబ్బందులను ఊహించుకొనలేక పోయినాను. కాని మీ ప్రయత్నము వృథా కారాదని నా కోరిక. అందుచేత మీరు బయలుదేరి వెళ్ళుచున్నప్పుడు - 'గాంధిజీ-మోతీలాల్ నెహూర్లను సంప్రదించి ఎట్టి ప్రకటనము కాంగ్రెసును సంతృప్తి పరచగలదో తెలిసికొనకుండ మీరు ప్రయణమై తరలి పోవుట కూడ' దని సూచించినాను. కాని అభిమానము వలననో, మరి యే యితర కారణము వల్లనో మీ రా పని చేయలేదు. ఎంత చెప్పినను కాంగ్రెసు శక్తి, గాంధిజీ ప్రభావము మీ మనసున కెక్కలేదు.

మీరు ఇంగ్లండులో ఉండినప్పుడు నేను రెండుఉత్తరాలు తమకు వ్రాసినాను. 'గాంధీజీయొక్క గాని మోతీలాల్ పండితుని గాని, లేదా యిరువురియొక్కగాని యభిప్రాయములను తీసుకొనకుండనే బ్రిటిష్ ప్రభుత్వము ఎట్టి ప్రకటనము చేసినను నిష్ఫలము కాగలదనియు-లేనిపోని దురభిమానమును పాటించి కాంగ్రెసు నాయకులతో సంప్రదింప బూనుట అపాయకరమనియు - బ్రిటిష్ ప్రభుత్వము అధికారమును ఒప్పజెప్పవలసి వచ్చిన కాంగ్రెసునకే గాని మరే యితరపక్షమునకు గాదనియు'- తెలియజేసినాను. అందుకుమీరు జవాబు వ్రాయుచు- 'భారతదేశములోని అన్ని పక్షములవారికి అంగీకార యోగ్యమగు శాంతియుత పరిష్కారమునకే కాయశక్తుల పనిచేయుదు' నని తెలిపినారు.

మీరు తరువాత ఇండియాకు తిరిగివచ్చి బ్రిటిష్ ప్రభుత్వము తరపున ఒకప్రకటనము చేసినారు. అందుకు రెన్నాళ్లముందుగా దాని నకలొకటి తమరు నాకు పంపించినారు. మీప్రకటనము కాంగ్రెసును ద్వైధీభావములో పడవేయుచున్నదని నేనుమీకు సూచించితిని. వారు మీప్రకటనమును అంగీకరించినచో కలకత్తా కాంగ్రెసు తీర్మానమునకు వ్యతిరేకముగ ప్రవర్తించినవారయ్యెదరు. అంగీకరింపకపోయినచో మితవాదుల సానుభూతిని పోగొట్టుకొనియెదరు. మితవాదులీ ప్రకటనమును అవశ్యము చేపరతుగా అంగీకరించెదరు.

“రౌండుటేబిల్ సమావేశము జరుగుట వ్యక్తిగతముగ నాకుఇష్టమే. కాని ముందుగా రాజకీయఖైదీల యావన్మంది విడుదల జరుగవలెను. రౌండుటేబిల్ సమావేశమునకు భారతదేశ ప్రముఖ రాజకీయవేత్తలు ఆహూయమానులు కావలెను. రౌండుటేబిల్ సమావేశానంతరము మీరు మా తలకేదో త్రవ్వియెత్తెదరనికాదు నాయభిప్రాయము. ఆ సమావేశము ఒకవేళ విఫలమే అయితే అప్పుడు కాంగ్రెసు మరొక బ్రహ్మాండమైన ప్రజాయుద్యమమును లేవదీయవచ్చును. అప్పుడు కాంగ్రెసు అక్రమముగ ప్రవర్తించినదని నిందించుట కెవరికిని నోరురాదు. కనుక కాంగ్రెసు నాయకులులేని రౌండుటేబిల్ సమావేశము వ్యర్థము, నిష్ఫలము అని నా నిశ్చయము. అందుకనియే మీరు తప్పనిసరిగా గాంధీజీతో ముందుగా సంప్రదింపవలసినదని నేను కోరినాను.

బ్రిటిష్ ప్రభుత్వప్రకటనమును కాంగ్రెసేతరపార్టీలు అంగీకరించినంతమాత్రమున ప్రయోజనములేదు. అవి అంగీకరించిననేమి, అంగీకరింపకపోయిననేమి. ముఖ్యముగ కాంగ్రెసు అంగీకరించుటయే కావలసినది. లాహోరు సమావేశములో జాతీయకాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యమే తమ లక్ష్యముగ తీర్మానించిరి. ఆ లక్ష్యమునకే బద్ధమైయుండి కాంగ్రెసు రౌండుటేబిల్ సమావేశములో పాల్గొననిరాకరించిన పక్షమున అది ఇంగ్లండునకును, ఇండియాకును దుర్దినములనియే చెప్పవచ్చును. కనుక కాంగ్రెసు రౌండుటేబిల్ సమావేశములో ఎట్లయిన పాల్గొనునట్లు చేయవలెను.

పరిస్థితులను చక్కజేయగల మహాత్ముడు గాంధీజీ యొక్కడే. ఆ మాట మీరు పూర్తిగ విశ్వసించండి. ఇప్పటికైనను మించి పోయినది లేదు. ఆయనను మొదట తృప్తిపరచండి.

మీరు లాహోరు కాంగ్రెసుకుముందు నా సలహాననుసరించి వైస్రాయి భవనంలో ఒక సమావేశం ఏర్పాటుచేశారు. కాంగ్రెసు తరపున గాంధీజీ, మోతీలాల్ నెహ్రూ హాజరైనారు. భారతదేశంలో తక్షణమే అధినివేశప్రతిపత్తి రాజ్యాంగ విధానమును అమలుచేయు ప్రణాళికను బ్రిటిష్ ప్రభుత్వము రౌండుటేబిల్ కాన్ఫరెన్సులో అంగీకరింపగలదని మీరు హామీ ఇవ్వవలసినదిగా గాంధిజీ కోరినాడు. మీరట్టిహామీ ఇవ్వలేక పోయినారు. ఆ సమావేశము భగ్నమైనది.

ఒక వైస్రాయిని అట్టి హామీ యివ్వవలసినదిగా కోరుటలో గాంధిజీ పొరపాటుచేసినాడని నేను మొదట భావించినాను. ఇండియా సమస్యను శాంతియుతముగ త్రికరణశుద్ధిగ పరిష్కరించుటకు ప్రయత్నించుచున్న వైస్రాయిని అట్టి హామీయడుగుట బాగుండలేదని నేను గాంధిజీతో చెప్పినాను.

కాని తరువాత ఇండియాలోను, ఇంగ్లండులోను జరిగిన సంఘటనలతో నాయభిప్రాయము మారినది. రసెన్ మహాశయుని ఉపన్యాసము, అసెంబ్లీలో తమరుకావించిన ఉపన్యాసము, కేలము తమ స్వీయ అభిప్రాయములను వెల్లడించినంతమాత్రమునకే మీరు అనేకమందిపై దమననీతిని ప్రయోగించుట, మీరు 'ఇంపీరియల్ ప్రిఫరెన్సును' తెచ్చి భారతదేశముపై రుద్దుట, వోటు స్వాతంత్ర్యమునుకూడ భంగపరచుట—ఇవన్నీ చూడగా గాంధిజీ అట్టిహామీని తమరినికోరుట సమంజసముగనే యున్నదని నాకుతోచెను.

తరువాత జాతీయకాంగ్రెసు సమావేశము లాహోరులో జరిగెను. తక్షణం సంపూర్ణస్వరాజ్యమే తమ లక్ష్యముగా తీర్మానించినారు.

గాంధిమహాత్ముడు తన తుదిమాట మీకెరుకపరచి శాసనోల్లంఘనోద్యమమునకు కడంగినాడు. అతని శంఖారావము దేశమంతయు ప్రతిశబ్దించినది. మూలమూలల నుండివచ్చి ప్రజలాయనను అనుసరించినారు. వందలకొలది ప్రజానాయకులప్పుడే జైళ్ళలోనున్నారు. ఇంకను వేలకొలదిగ దేశభక్తులు మీ జైళ్ళకేకాదు, అవసరమైనచో ఈ స్వాతంత్ర్యసమరమున ప్రాణాలర్పించుటకు కూడ భయపడరు.

1921 లో సహాయనిరాకరణోద్యమమును మీరు అణచివేసినారు; నిజమే. బహుముఖమైన దమననీతిని మీరు ఆనాడుకూడ వినియోగించినారు. నాటి ఆ యుద్యమము విఫలమైపోయినను అది ప్రజలలో

ఒక అపూర్వనూతన చైతన్యమును సృష్టించినది. ప్రతి భారతీయుని రక్త కణాలలో స్వాతంత్ర్యపిపాస వెల్లివిరిసినది.

ఈ ప్రస్తుత శాసనోల్లంఘనోద్యమ సందర్భమున మీరు అవలంబించిన విధానములన్నియు - సైమన్ కమిషన్‌ను విసర్జించుట, కాంగ్రెసువారితో సంప్రదింపక పోవుట— ఇత్యాదులన్నియు తప్పుడు సలహాలమూలమున జరిగినవి. భారతప్రజలపై కాంగ్రెసుయొక్క, గాంధీజీయొక్క ప్రభావము అగ్గలమన్న సంగతి నేను బలుమార్లు చెప్పినను మీరు విశ్వసించినారుకారు. ఇంతకు పాపము! మీతప్పేమియు లేదు. మీచుట్టునున్నవారికి కాంగ్రెసుయెడల సానుభూతిలేదు; దేశముపట్ల భక్తి లేదు; దేశంలోని యదార్ధ పరిస్థితులెరుగరు. అట్టిమహనీయుల సలహాలకు చెవియొగ్గి మీరు మరొకవిధముగ ఎట్లుప్రవర్తింప గలిగియుందురు?

ఈ శాసనోల్లంఘన మహోద్యమములో మీరు కనువిప్పుగలుగ యుండవచ్చును — ఈ క్లిష్టసమయమున గూడ నేను తమ కొక సలహా యిచ్చెదను: దురభిమానాలు విడిచిపెట్టండి, గాంధిజీని పిలిచి అతనితో ఒడంబడిక గావించుకోండి.

కాంగ్రెసు సంపూర్ణస్వాతంత్రమే తన లక్ష్యముగా ప్రకటించిన మాట వాస్తవమే. అయినను...ఇంకను ఎన్నోత్యాగములు చేయకుండ, ఆలస్యములేక బ్రిటిష్ కామన్వెల్తులో ఇండియాకు బాధ్యతాయుత స్వపరిపాలనము సిద్ధించుటకు కాంగ్రెసు సమ్మతించుననియే నానమ్మకము. బ్రిటన్‌తో సంబంధములేని సంపూర్ణ స్వాతంత్ర్యముకన్న అధినివేశప్రతిపత్తియే భారతదేశమునకు క్షేమకరమనికూడ నా విశ్వాసము.

ఒక బాధ్యతగల మంత్రి ఆధీనములో ఎంతకాలము ఏయేసరిహద్దులమీద ఎందరు బ్రిటిష్‌సైనికులుండవలెను? అన్న సమస్యయు, విదేశాంగ సమస్యయు, భారతసంస్థానాల సమస్యయు— ఈ మూడు సమస్యలపై ముఖ్యముగా రౌండుటేబిల్ సమావేశములో ఒక ఒడంబడికకు రావచ్చును. భారతదేశ పరిపాలనకు సంబంధించిన తదితర సమస్యలేవియు అక్కడ చర్చకు రానవసరములేదు. ఆ సమావేశములో ఇరుదేశముల రాజకీయవేత్తలుకలసి పాల్గొనవలెను.

ఇండియా అధినివేశప్రతిపత్తిని పొందగల అర్హతను బ్రిటిష్ ప్రభుత్వము గుర్తించితీరవలెను. ఆ యధినివేశప్రతిపత్తిని ఇండియాలో

ప్రవేశపెట్టువిధానములను చర్చించుటకై ఇరుదేశాల రాజకీయవేత్తలును సమావేశమై చర్చించుకోవలెను—అని నేను 1930 జనవరి నాటినుండియు చెప్పుచునేయున్నాను. ఈ పని లాహోరుకాంగ్రెసుకు పూర్వమే జరిగి యుండిన బాగుండెడిది. ఇప్పుడు దేశములో అధినివేశప్రతిపత్తిని కోరు వారు కొందరు, సంపూర్ణస్వాతంత్ర్యమును వాంఛించువారు కొందరు—రెండుతెగలుగ అయినారు. ఆ రెండు పక్షాలవారును ఒకే నిర్ణయమునకు వచ్చుటయనునది మా ఆంతరంగిక సమస్య.

ఇండియా సమస్యను సహృదయముతో పరిష్కరించవలెనన్న ఉత్సుకత మీకు కలదు. అయినను మీరందుకు ఎదుర్కొనవలసిన కష్టములనుకూడ నేను గ్రహించగలను. కొన్నాళ్ళనుండియు ఈ దేశములో రేగుచుండిన సంచలనము గమనించుచున్నారుకదా! స్వరాజ్యసంపాదనకు ప్రజలు సర్వత్యాగములుచేయుటకు సిద్ధముగనున్నారన్న యంశము మీకు విశదమైనదికదా!

కనుక బ్రిటిష్ ప్రభుత్వముతో మీకుగల పలుకుబడినంతయు ఉపయోగించి ప్రయత్నించండి. బ్రిటిషు ప్రభుత్వమునకు నచ్చజెప్పి ఇండియాకు అధినివేశప్రతిపత్తిఇచ్చు ఏర్పాటులను సృష్టించ లేకపోయి నచో మీరీ వైస్రాయిపదవికి రాజీనామా యిచ్చివేయండి. అంతేగాని దమన నీతినుపయోగించి కోట్లకొలది భారతీయుల జన్మహక్కును అణగ ద్రొక్క జూచువారితో చేతులుకలిపి అపకీర్తి ఆర్జించకండి.

మీరు ఇండియాకు మంచిసేవయే చేసినారు. తప్పుడు సలహాలు వినకుండనుండినచో ఇంకను మంచిసేవచేసి యుండెడివారే. ఈ క్లిష్టసమస్యను పరిష్కరించుశక్తిసామర్థ్యములు మీకు లేనియెడల వెంటనే వైస్రాయి పదవినుండి విరమించితిరేని ఈ దేశమునకు అత్యంతసేవ చేసినవారయ్యెదరు.

కాని మీరు చాలవరకు భారతప్రజల ఆదరము పొందియున్నారు. ఇంగ్లండులోని అన్నిపార్టీలవారితో మీకు పరిచయమున్నది; పలుకుబడియున్నది. పైగా ఇండియా సెక్రటరీకి తమపై మిక్కిలి విశ్వాసము. కనుక మీరు ధైర్యముచేసి వ్యవహరించితిరేనే ఇండియాకేకాదు, మీ ఇంగ్లండునకుకూడా ఎంతోసేవ—ఇదివరకెవ్వరును ఎన్నడును చేయనంతసేవ—చేయగలుగుదురు.”

# 6

## * "ఎస్టేటు-పెన్షన్"

మహాత్ములు స్వార్థముచూచుకోరు. దేశాభ్యుదయము, ప్రజాక్షేమము వారి ప్రధానలక్ష్యాలు. ఆ తరువాతనే తమ బాగోగులు.

విఠల్‌భాయిపటేల్ అసెంబ్లీ అధ్యక్షపదవి నధిష్ఠించినది తన భార్యాబిడ్డలను పోషించుకొనుటకు కాదు. తన్ను ఆశ్రయించుకొని యున్న బంధుమిత్రాదులకు తనపలుకుబడి ఉపయోగించి ఉద్యోగాలు ఆర్జించిపెట్టుటకుగాదు. కీర్తిప్రతిష్ఠలు ఆశించికాదు.

అసెంబ్లీ అధ్యక్షుడుగనుండి మాతృదేశమునకు వీలైన సేవచేయుటకే అతడా పీఠమును కోరి అధిష్ఠించినాడు. మాతృదేశ సేవచేయుటకు ఉన్న అవకాశములన్నియు వినియోగించుకొన్నాడు. ఇక తాను చేయదగినది యేమియులేదని తోచిననాడు అంతఉచ్ఛపదవినికూడ తృణప్రాయముగ త్యజించివచ్చినాడు అదియే నిజమైన త్యాగము; కర్మవీరుని లక్షణము. అదియునుగాక—

గాంధిజీ దండీయుద్ధము ఆరంభించిన రోజులవి. ఆ మహాత్ముని శంఖారావము ప్రతి భారతీయుని హృదయంలో మారుమోగినది. ఎక్కడికక్కడే దేశనాయకులు వెలసినారు. ఎక్కడి కక్కడే సైన్యాక్షౌహిణులు సమీకృతములైనవి. తల్లులిచ్చిన దీవనబలములతో, ఇల్లాళ్ళు తీర్చిదిద్దిన సింధూరతిలకాలతో భారతవీరులు అపారతేజో విరాజమానులై... గాంధిజీ ఆరంభించిన ఈ మహాస్వాతంత్ర్య సంగ్రామము ఒక 'వెర్రాట'గా భావించి నడుములు బిగించి ముందుకుసాగినారు.

---

* ఇంగ్లండులో రాజీనామా యిచ్చిన స్పీకర్లకు ఎస్టేటు-పెన్షన్ ఇచ్చుట ఆచారము. ఈ పరిస్థితిలో ఇండియాలో పటేల్‌కు కారాగార శిక్షయే బహూకృతి.

వారికి అహింసా మహాస్త్రము తప్ప వేరు ఆయుధాలులేవు. గాంధిజీ ప్రసాదించిన నైతికబలమే తప్ప మరి మారణయంత్రాలులేవు. ప్రాణాలర్పించుటేతప్ప ప్రాణాలుకొను యుద్ధక్రమము వారెరుగరు.

ప్రభుత్వమువారి పశుబలము విజృంభించినది. కనబడినవారినెల్ల తీసుకొనిపోయి జైళ్ళలోక్రుక్కినారు. నిర్దాక్షిణ్యముగ లాఠీఛార్జీలు జరిగినవి. తుపాకులు పేలినవి. మిన్నంటుచున్న భారతస్వాతంత్ర్య జ్వాలలపై బ్రిటిషుప్రభుత్వము వారుణాస్త్రాలను విడిచినది.

ఇట్లు నైతికపశుబలాలు రెండును బాహాబాహీ, కచాకచి, ముష్టాముష్టి పెనగులాడుతున్నవి. విఠల్ భాయ్ దేశపరిస్థితుల స్వరూపము చూచినాడు. ప్రభుత్వము ఉపయోగించుచున్న దమన నీతినిచూచి ఏవగించుకొన్నాడు. భారతవీరుల స్వాతంత్ర్య దీక్షనుచూచి రోమ్మాలు విరుచుకొన్నాడు.

ఇట్టి సమయములో నేనింకను ఈ అధ్యక్షపీఠముపై పెంపుడు రామచిలుకవలె నేనికిక్కడ? పోయి నాదేశీయులతో భుజములొరసి నిల్చుండి యుద్ధము చేసెదనుగాక! అదియే నా అవశ్యకర్తవ్యము— అని నిశ్చయించుకొన్నాడు. ఆ నిశ్చయమునే నిర్భయముగ వైస్రాయికి తెలియజేసి ఉద్యోగమునకు స్వస్తిచెప్పి బైటికి వచ్చినాడు. ఆత్మ మర్యాదను, నిలువబెట్టుకొన్నాడు.

ఈ సందర్భములో, విశ్వకవి రవీంద్రుడు తన 'నైట్' (knight) బిరుదమును వదులుకొనుచు, పంజాబు దురంతాలయనంతరము మనను విరిగిపోయి, అప్పుడు వైస్రాయిగనుండిన ఛల్మ్సఫర్డు ప్రభువునకువ్రాసిన యుత్తరము స్ఫురించుచున్నది.

"మీరు మాకిచ్చిన గౌరవనీయములగు బిరుదులు మాకు అత్యంత లజ్జాకరములుగ అవమానజనకములుగ పరిణమించు దినములేతెంచినవి. నామటుకు నేను ఈప్రత్యేకబిరుదులు ఊడబెరికి కొనగోరుచున్నాను. అనామకులై, మీచేతిమీదుగ అమానుష హింసలకులోనై అటమటించుచున్న నాదేశీయులతోపాటు నేనును అనామకుడనై నిలువగోరెదను" అని విశ్వకవి వ్రాసినాడు.

**శాసనోల్లంఘనోద్యమ ప్రవేశము**

విఠల్ భాయ్‌పటేల్ తన ముందు కార్యక్రమమును రాజీనామా యుత్తరములోనే సువ్యక్తము చేసినాడు. ప్రజలపక్షమున నిల్చి వారి న్యాయబద్ధములైన హక్కులకోసము తానుకూడ స్వాతంత్ర్య సమరములో పాల్గొనుట—అదియే అతని నిర్ణయము.

అసెంబ్లీగద్దె అధిష్టించుటకు పూర్వము విఠల్ భాయ్ దేశములోని సర్వప్రజా ఉద్యమములలో పాలుతీసుకొనుచుండెడివాడే. బార్డోలీ సత్యాగ్రహ మప్పుడు అతడద్దానికి ఎంతచేయూతయొసగి విజయవంతముగ సాగించినాడో ప్రథమ ప్రకరణమున వివరించినాము. కనుక అసెంబ్లీ అధ్యక్షపదవినుండి విముక్తుడై వచ్చిన వెంటనే మరల కాంగ్రెసు ఉద్యమములో చేరవలయునని యే యాతడు సంకల్పించెను.

1930 మే 3 తేదీని...రాజీనామాయిచ్చిన కొలదిరోజులకు విఠల్ భాయ్ కలకత్తానువచ్చెను. ప్రజలాతనికి స్వాగతమిచ్చు నిమిత్తము తండోపతండములుగ స్టేషనువద్దగుమికూడిరి. అది ప్రభుత్వముదృష్టిలో మహాపరాధమయ్యెను. వెంటనే పోలీసులువచ్చి ప్రజలపై లాఠీచార్జిచేసినారు. పండిట్ గోవిందమాలవీయ ఆదిగాగల చాలమందికి గాయములు తగిలినవి.

కలకత్తా వీధులలో ఈవిధముగ ప్రభుత్వము ప్రదర్శించిన అమానుషచర్యలను విఠల్ భాయ్ కన్నులార చూచినాడు. ఇంతవర కాతనికి శాసనోల్లంఘ నోద్యమములో ప్రత్యక్షముగ పాల్గొను ఉద్దేశము లేక పోయినను, ఇట్టి సంఘటనలు కంట బడినతరువాత ఉండబట్టలేక పోయినాడు. స్వాతంత్ర్య సమరములో ఒక్కుమ్మడి గంతువేసి దుమికినాడు.

**పెషావర్ సంఘటనలు**

అసలు 1920 లో రేగిన సహాయనిరాకరణోద్యమముతోనే భారత దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించి యుండవలసినది. కాని గాంధిజీ మధ్యలోనే ఉద్యమమును ఉపసంహరించినాడు. అందుకు అచ్చటచ్చట దేశీయులు కొంతవరకు హింసాత్మకముగ ప్రవర్తించి యుండుటయే కారణము.

మహాత్మునకు అహింసలో సంపూర్ణ విశ్వాసమున్నది. అసిధారా వ్రతముగ దాని నాతడు అనుష్టించుచున్నాడు. ఆయన శత్రువును ద్వేషిం

చడు. ఆశత్రువులోని దౌష్ట్యమునే ఆయన అసహ్యించుకొనును. బ్రిటిష్ వారియెడల ఆయనకు ద్వేషములేదు. వారి సామ్రాజ్యతత్వమునే ఆయన నిరసించును. అశాంతి, అనిష్ట, అసహనము ఆయనకే తగిపోయినది.

కాని సామాన్య మానవులకు అంతఓర్పు ఉండుట అరుదు. ఒక ప్పుడు వివేకానందు డన్నాడు— "నేను బహుదేశాటనము చేసినాను. మనిషిని, అతనిలోని చెడ్డతనమును పృథక్కరించి, ఆ చెడ్డతనమును మాత్రమే ద్వేషించి, మనిషిని ప్రేమించగల వ్యక్తులను నేనెక్కడా చూడలేదు" అని. అదియునుగాక బ్రిటిష్ ప్రభువులు భారతీయుల స్వాతంత్ర్య పిపాసను అణగద్రొక్కి వేయుటకు క్రూరాతి క్రూరములైన విధానములను అవలంబించినప్పుడు కొందరు ఉద్రేకులై ప్రతిహింసా బుద్ధితో ప్రవర్తించుట సంభవించుచుండును.

అట్టి సంఘటనమే ఒకటి పెషావరులో శాసనోల్లంఘనోద్యమ సందర్భమున జరిగెను. రాష్ట్రీయ కాంగ్రెసుకమిటీ సభ్యులందరను ప్రభుత్వము బంధించుటతో, ప్రజలు ఉద్రిక్తులైనారు. గందరగోళము జరిగినది. ఒక బ్రిటిష్ అశ్వికుడు మరణించినాడు. ప్రభుత్వమువారు మిలిటరీ సైనికులనుతెచ్చి ప్రజలపై కాల్పులు సాగించినారు. పరిస్థితులు అత్యంత ఘోరముగా విషమించిపోయినవి. పరిపాలనా కార్యకలాప ములు స్తంభించిపోయినవి.

ఈసందర్భంలో రాయల్ ఘరివాల్ సైనికులు కొందరు దేశీయు లపై కాల్పులు ప్రయోగించుటకు నిరాకరించిరి. "మాకును ఆత్మగౌర వము ఉన్నది. ఈపట్టణప్రజల చేతులలో ఆయుధములన్నచో మేము కూడా తుపాకులు పేల్చెదము. పిల్లలను, బిచ్చగాళ్ళను మేము చంపనో ల్లము......ఇండియాసైన్యము ఇండియా రక్షణకుగాని. నిరాయుధులగు ప్రజలను చంపుటకు కాదు." అని వారు పలికినారట.

అసలు ఈపెషావరు విషాదాంత గాథకు కారణము; ఒక బ్రిటిష్ సైనికుడు తుపాకి పేల్చినాడట. అది అకస్మాత్తుగ ఒక రిక్షాలో వెళ్ళు చుండిన ఒక సిక్కుయువతికి తగిలి, ఆమెయు, ఆమెయిరువురు బిడ్డలును మరణించిరి. దానితో ప్రజల కోపతాపములు హద్దుమీరి విజృంభించినవి.

ఈ పెషావర్ అల్లరుల విచారణ సంఘమొకదానిని ప్రభుత్వము నియమించెను. అందు అలహాబాద్ హైకోర్టుజడ్జి షామహమ్మద్

సులైమాన్, కలకత్తా హైకోర్టుజడ్జి పాంక్రిడ్జి—ఇరువురును సభ్యులుగా నుండిరి.

"ప్రభుత్వపు మిలటరీకారు క్రిందబడి కొంతమంది ప్రజలు మర ణించిన తరువాతనే బ్రిటిష్ ఆశ్వికుని ప్రజలు నిరోధించినారు. పరిస్థితు లంత తీవ్రముగ విషమించుటకు ప్రధానకారణము మిలటరీ కారుక్రింద కొందరు ప్రజలు మరణించుటయే" — అని న్యాయమూర్తి సులైమాన్ తెలిపినాడు.

ఎట్లయినను పెషావర్ కథ భయంకరముగ, విషాదకరముగ ముగిసెను.

**పటేల్ కమిటీ**

అఖిల భారతకాంగ్రెసు కార్యవర్గము కూడ పెషావరు సంఘటనల యదార్థ స్వరూప మును ప్రపంచమున కెరుకపరచు నిమిత్తము ఒక విచారణకమిటీని నియమించెను. దానికి మన విఠల్‌భాయ్ పటేల్ అధ్యక్షుడు.

కాని యీవిచారణ సంఘసభ్యులను వాయువ్య సరిహద్దురాష్ట్ర ములో అడుగు పెట్టరాదని ప్రభుత్వము నిషేధించెను. తరువాత ఈసంఘమువారు తయారు చేసిన నివేదికనుగూడ ప్రభుత్వము జప్తుచేసెను.

ఎంతో జాగరూకతతో పటేల్ విషయసంగ్రము చేసినాడు. చివ రకు తననివేదికను కాంగ్రెసు కార్యవర్గమునకు సమర్పించినాడు.

1930 ఆగష్టు 7 తేదీని పటేల్ కమిటీ నివేదికను పరిశీలించుటకై కాంగ్రెసు కార్యవర్గము ఢిల్లీలో సమావేశమయ్యెను. ప్రభుత్వ సమావేశ మును నిషేధించెను. కాని కాంగ్రెసు కార్యవర్గసభ్యులు దానిని పాటించ లేదు. విఠల్‌భాయ్‌కూడా ఆనిషేధపుటాజ్ఞను ఉల్లంఘించినాడు. వెంటనే ప్రభుత్వము కాంగ్రెసు వర్గసభ్యులను, పటేల్‌ను పట్టుకొనిపోయి ఆరు నెలల కఠినశిక్ష విధించెను.

అప్పుడన్నాడు పటేల్ నవ్వుచు "ఇంగ్లండులో తమ పదవులకు రాజీనామాలిచ్చివచ్చిన స్పీకర్లకు ఎస్టేటు - పెన్షను ఇచ్చి గౌరవించు ఆచా రముకలదు. ఇండియాలో ప్రథమ అనధికార అసెంబ్లీ అధ్యక్షునికి కారా గారశిక్షయే ఎస్టేటు పెన్షనులకు బదులు లభించినవి.

**పటేల్ అనారోగ్యం**

మొదట విఠల్ భాయిని ముల్తాన్ జైలులో ఉంచినారు. అక్కడ అతడు జబ్బుపడెను. అందుచే అతనిని అచ్చటనుండి మార్చవలసి వచ్చెను. కోయంబత్తూరులో తగిన చికిత్స చేయించవచ్చునన్న యుద్దేశముతో ప్రభుత్వమువారతనిని కోయంబత్తూరు జైలునకు పంపిరి.

డాక్టరులు పరీక్ష చేయగా కడుపులో పుండు పెరుగుచున్నట్లు తెలిసెను. శస్త్రచికిత్స చేయుటకై విఠల్ భాయ్‌ని ఆపరేషన్ బల్లపై పడుకోబెట్టినారు. కాని అకస్మాత్తుగా అతడు క్రిందబడెను. భగవదనుగ్రహము వలన గాయము లేమియు తగులలేదు. తరువాత వారము రోజులకు జైలు రిపోర్టును ఇండియా ప్రభుత్వమువారి పరిశీలనకై పంపవలసినదిగా జైలు సూపరిండెంటుకు లేఖవ్రాసెను.

1931 జనవరి 5 తేదీని మద్రాసు శాసనసభలో ఒక సభ్యుడు విఠల్ భాయి చాల జబ్బుగానున్న కారణమున వెంటనే విడుదల చేయవలసినదిగా ప్రభుత్వమును కోరుచు ఒక తీర్మానమును ప్రవేశపెట్టనున్నట్లు" ప్రకటించెను.

తరువాత రెండు రోజులకే ప్రభుత్వము విఠల్ భాయ్‌ని విడుదల చేసెను. అప్పటికే అతని ఆరోగ్యము పూర్తిగా చెడిపోయెను. అందుచేత తదనంతరము చరిత్రాత్మకమగు గాంధీ - ఇర్విన్ ఒడంబడికగా పర్యవసించిన రాయబారములలో నాతడు పాల్గొనలేక పోయెను.

తరువాత ఫిబ్రవరిలో అతడు వియన్నాకు ప్రయాణమై వెళ్ళిపోయెను. అక్కడ అతని కొక పెద్ద ఆపరేషన్ చేసినారు. కొంతవరకు స్వాస్థ్యము చేకూరినది.

**రెండవ రౌండు టేబిల్ సమావేశము**

ఇంతలో భారతదేశసమస్యా పరిష్కరణ నిమిత్తము ఇంగ్లండులో రెండవ రౌండుటేబిల్ సమావేశము సమాయత్తమైనది. మొదటి సమావేశమున కాంగ్రెసువారు పాల్గొనలేదు. ఈసమావేశమున కాంగ్రెసు ప్రతినిధులు కూడ ఆహూయమానులైనారు.

మోకాలుదిగని కొల్లాయిగట్టి, ఒకచేదండము, మరొకచేత భగవద్గీత ధరించి, నలుబదినాలుగుకోట్ల భారతప్రజల ఏకైకాత్మ తాను బయలుదేరి వెళ్ళినాడు.

విఠల్ భాయ్‌కూడ వియన్నానుండి సరాసరి ఇంగ్లండు వెళ్ళినాడు. సమావేశమునకు వచ్చిన కాంగ్రెసు ప్రతినిధులకు తాను చేతనైనంతవరకు సాయముచేయవలెననియే యాతడు వచ్చెను. కాని శరీరారోగ్యము సరిగ్గా లేనందునను, గాంధిజీ యాశయములు తనకు కొంతవరకు వ్యతిరేకముగ నుండుటచేతను అతడెక్కువగ యేమియు చేయలేక పోయెను.

రౌండు టేబిల్ సమావేశఫలితములు విఠల్ భాయి కేమంత నచ్చలేదు. సమావేశానంతరము బ్రిటిష్ ప్రభుత్వము ప్రకటించిన శ్వేతపత్రి నిబంధనల గూర్చియు, వారి యభిప్రాయములను గూర్చియు పటేలు ఇట్లు విమర్శించెను —

"ప్రథమ రౌండు టేబిల్ సమావేశానంతరము బ్రిటిష్ ప్రధాన మంత్రి ఇండియాయెడ బ్రిటిష్‌ప్రభుత్వ వైఖరిని ఉద్ఘాటించినాడు. ఈ ద్వితీయ సమావేశానంతరము వెలువడిన శ్వేతపత్రముకూడ ఆ పాతవైఖరికే ఎట్టిమార్పులు చేర్పులులేకుండ పునరుద్ఘాటించుచున్నది.

ఈ రౌండు టేబిల్ సమావేశమునకు కాంగ్రెసు సహకారము లభించినది, గాంధీ-ఇర్విన్ ఒడంబడిక మూలమున. అయినను శ్వేతపత్రిములో దాని ప్రసక్తియే లేకపోవుట చిత్రము. గాంధీ-ఇర్విన్ ఒడంబడికలో ఆశలు పెట్టుకున్నవారికి భ్రమ వీడిపోయినది.

శ్వేతపత్ర నిబంధనలు (white paper) భారతీయులకు కేంద్రములో బాధ్యతాయుత స్వపరిపాలనము ఇచ్చుటకు శ్వేతపత్రము అంగీకరించుచున్నమాట వాస్తవమే కాని అది కేంద్రప్రభుత్వము, కేంద్రశాసనసభ అఖిలభారత ఫెడరల్ విధానము ననుసరించి యున్నప్పుడే.

అంతేకాక ఈ క్రింది నిబంధనలుకూడ ఉన్నవి.

1. దేశరక్షణ, విదేశాంగ వ్యవహారాలు, వైస్రాయి చేతిలోనే ఉండవలె

2. ఫైనాన్సు విషయములో ఇండియా కార్యదర్శికిగల అధికారమును మినహాయించియే ప్రజామంత్రి స్వీకరింప వలసియుండును.

3. సంస్థానధీశులకు, బ్రిటిష్ ప్రభుత్వమునకుగల సంబంధ భాంధవ్యాలు చక్రవర్తి పర్యవేక్షణలో ఉండితీరవలసిందే.

4. బ్రిటిష్ వ్యాపారస్థునియెడ ఆర్థికంగాగాని, వ్యాపార దృష్ట్యాగాని, అన్యాయప్రవర్తన కూడదు.

5. మైనారిటీ హక్కులను కాపాడు విషయములో తన స్వ బాధ్యతలు నిర్వహింప గలందులకు వైస్రాయికి అవసరమైన అధికారాలు దత్తములైనవి. దేశములో శాంతిభద్రతలు కాపాడు సర్వాధికారములు ఆయనవే.

శ్వేతపత్రము కాంగ్రెసు కోరికలను త్రోసిపుచ్చినది

"కరాచీ కాంగ్రెస్ తీర్మానము ననుసరించి జాతీయ వాదుల కోరికలు:

1. సంపూర్ణ స్వాతంత్ర్యము; ముఖ్యముగా
2. దేశరక్షణ, విదేశాంగ వ్యవహారాలు, ఫైనాన్సు, ప్రజల అధీనములో ఉండవలెను,
3. బ్రిటిష్ కామన్వెల్తునుండి విడిపోగలహక్కు భారతదేశమునకు ఉండవలె,
4. ఇండియా అప్పు ఎంతవరకు సమంజసమైనదో, అందులో ఎంత భాగము బ్రిటిష్ ప్రభుత్వము తనపైత్తిపై వేసుకొనవలెనో— ఈ విషయములను ఒక నిష్పాక్షిక విచారణ సంఘముద్వారా నిర్ణయించవలె,

శ్వేతపత్రమును, కరాచీ కాంగ్రెసు తీర్మానమును పఠించినచో బ్రిటిష్ ప్రభుత్వము జాతీయవాదుల కోరికలను పూర్తిగ త్రోసిపుచ్చినదని గ్రహింపవచ్చును.

దేశరక్షణము, విదేశాంగ వ్యవహారములు వైస్రాయి అధీనములోనే ఉండవలెనని చెప్పుట కాంగ్రెసువాదుల సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానమును త్రోసిపుచ్చినట్లే కదా!

గోరుచుట్టుపై రోకటిపోటు

అట్లు త్రోసిపుచ్చుట కాంగ్రెసును అవమానించినట్లైనది. బ్రిటిష్ ప్రధాని అంతటితో ఊరకొనలేదు. ఇండియాకు స్వాతంత్ర్య మిచ్చు నుద్దేశము తమకు లేదని కుండబద్దలుకొట్టినట్లు చెప్పినాడు.

అసలు ఇండియాకు స్వాతంత్ర్యమును కోరుటలేదట. దేశరక్షణ - విదేశాంగ వ్యవహారముల విషయమై తాము విధించిన నిబంధనలకు ఇండియా ఒప్పుకొనుచునే యున్నదట! ఈమాటలు కాంగ్రెసువారి గోరుచుట్టుపై రోకటిపోటువలె తగిలినవి.

“దేశరక్షణము, విదేశాంగవ్యవహారములు ప్రజామంత్రుల యధీనములో నుండవలెనని కాంగ్రెసు కోరినది. అది కాంగ్రెసు కోరికయేగాని ప్రజావాదం కాదని బ్రిటిష్ ప్రధానమంత్రి యుద్దేశమన్నమాట. ప్రస్తుత పరిస్థితులలో ఆరెండుపోర్టుఫోలియోలును ప్రజామంత్రులకు ఇవ్వరాదని పలికిన తదితర బ్రిటిష్ - ఇండియన్ ప్రతినిధుల మాటలే భారతవాణి యన్నమాట! ఇక రౌండుటేబిల్ సమావేశము భగ్నముగాక సఫలమెట్లగును!

రౌండుటేబిల్ సమావేశములో కాంగ్రెసు పార్టీకూడా భారతదేశంలోని అనేక పార్టీలలో ఒకటిగా పరిగణింపబడినదేగాని, దాని విశిష్టత, ఔత్కృష్ట్యత, శక్తి గుర్తింపబడలేదు. అదియే యావద్భారతదేశమునకును ప్రాతినిధ్యము వహించిన మహాసంస్థ యన్నసంగతి బ్రిటిష్ ప్రభువులు పూర్తిగ విస్మరించినారు.

దేశరక్షణము వైస్రాయి చేతిలో
సామ్రాజ్యము నుండి విదేకదా! కేంద్ర ప్రభుత్వ ఆదాయములో
విడిపోవుహక్కు— 45 శతాంశాలు మిలటరీ పోషణక్రిందనే
వ్యయమగుచున్నది. దానిపై ప్రజామంత్రికి
ఎట్టి జోక్యము ఉండరాదు కదా! అదియు గాక—

ఇండియామంత్రి నియమించే ఉద్యోగుల జీతాలు, పెన్షనులు ఉన్నవి. ఇండియా అప్పుపై వడ్డీవున్నది. ఇవియన్నియు మినహాయించి ఇక ప్రజామంత్రి యధికారములో ఉండు ఫైనాన్సుఎంత?

ఇట్టి పరిస్థితులలో ఆత్మగౌరవము గల ఏ భారతీయుడు ఈఫైనాన్సు పోర్టుఫోలియోను స్వీకరించును? ఈ నిబంధనలు అవమాన కరముగ ఉన్నవి కాదా!

కనుక ఫైనాన్సు విషయమై కాంగ్రెసు కోరికగూడా నిస్సంశయముగ త్రోసి పుచ్చబడినదన్నమాటే!

ఇకపోతే ఇండియా   అప్పుమాట రౌండుటేబిల్ సమావేశములో చర్చకే రాలేదు, రామరామ!

కాంగ్రెసు కోరికలన్నింటిలో ముఖ్యమైనది : బ్రిటిష్ కామన్ వెల్తునుండి విడిపోగలహక్కు కాని—

బ్రిటన్‌తో భారతదేశ భాగస్వామ్యము సమావేశములో చర్చకు రానేలేదు. ఇక కామన్‌వెల్తు నుండి విడిపోవు హక్కుమాట దేవుడెరుగును.

దేశీయులు - విదేశీయులు.

ఈ విధముగ కరాచీ కాంగ్రెసులో ప్రతిఫలించిన ప్రతిజాతీయ వాంఛితమును బ్రిటిష్ ప్రభుత్వము ఖండితముగ త్రోసిపుచ్చెను. కేంద్రజాతీయ ప్రభుత్వము స్థాపితము కాకుండునట్లు ఏవేవో నిబంధనలు విధించెను. వాటిలో ఒకటి దేశీయులను వలెనే విదేశీయులను కూడ ఆదరించవలెనని ఇండియాను నిర్బంధించుట.

ఇండియాలోని బ్రిటి వ్యాపారస్థుల, కంపెనీల, హక్కులకు, భారత జాతీయుల హక్కులకు తేడా ఉండరాదు. అన్నివిధముల బ్రిటిష్ వ్యాపారస్థుల హక్కులను కాపాడవలసినదే—అని మొదటి రౌండు టేబిల్ సమావేశము విధించినది.

'ఇది భవిష్యద్భారత పార్లమెంటు హక్కులను సంకుచితము చేయుచున్నది. భారతప్రజలు అందుకు ఒప్పుకొనలేరు. 'దేశక్షేమ దృష్ట్యా ఒక్కొక్కప్పుడు విదేశీయులను వేరుభావముతో చూడవలసిన పరిస్థితులేర్పడును. కాని అట్టి అధికారము భవిష్యద్భారత శాసనసభకు లేకుండ... శ్వేతపత్రములోని యీ నిబంధనము...శాసించుచున్నది; కనుక ఇది కాంగ్రెసుకు స్వీకారయోగ్యముగ లేదు' అని గాంధిజీ యాక్షేపణ తెలిపినాడు.

ఈ రెండవ సమావేశములో బ్రిటిష్‌వర్తకునికే కాదు, ఇండియాలో నివసించుచుండు ప్రతి బ్రిటిషువానికిని ప్రత్యేక హక్కులు స్థిరమైపోయినవి.

మధ్యకాలము

ఈ క్రొత్త ఫెడరల్ రాజ్యాంగ విధానముద్వారా ఇండియా తన ప్రధాన ఆశయమున సిద్ధింప జేసుకొనగలదని బ్రిటిషు

వారు ఆశించినారు. శ్వేతపత్ర నిబంధనలన్నియు ఈ మధ్యకాలమునందు మాత్రమే అమలునందుండునని వారు చెప్పిరి.

కాని ఈ మధ్యకాలమనగా ఎన్నిసంవత్సరములో నిష్కర్షగా పేర్కొనబడలేదు. శ్వేతపత్రములోగాని ఫెడరల్ కమిటీ నివేదికలోగాని అది నిర్ణీతము కాలేదు. అయిదు సంవత్సరములు కావచ్చును, యాభై సంవత్సరములు కావచ్చును.

తద్విషయికమైన ప్రశ్నకు జవాబు చెప్పుచు బాల్డ్విన్ ఇట్లు నొడివెను. 'మధ్యకాలము ఎన్ని సంవత్సరములో ఎవరును చెప్పలేరు. అది పార్లమెంటు ఇష్టములోనున్నది. ఈ క్రొత్త రాజ్యాంగ విధానము అమలుచేసినతరువాత దానిని మార్పుటకు పార్లమెంటు అనుమతిలేనిదే ఎవరికిని సాధ్యముకాదు' అని.

కనుక ఈమాటలనుబట్టి ఈ క్రొత్త రాజ్యాంగము ద్వారా భారతదేశము తన స్వాతంత్ర్యాశయమును సిద్ధింప జేసికొన గలదనుట అడియాసకాదా!

**వైస్రాయి అసాధారణాధికారము**

వైస్రాయికి అసాధారణాధికారములు ఉండునేకాని అవి కాలక్రమమున స్వపరిపాలనా విధానము ననుభవించు అధినివేశ రాజ్యములలోవలె ఉపయోగింపబడవని పైకిచెప్పుమాట. ఇండియా విషయములో మాత్రము బ్రిటిష్ ప్రభుత్వాభిప్రాయ మదికాదు.

వైస్రాయి తన అసాధారణాధికారములను ఇండియాలో విశృంఖలముగా ఉపయోగించుచునే యున్నాడు; మనము నానా అవస్థలు పడుచునేయున్నాము. అనుభవములో ఉన్న విషయమే.

ఇంతకు రెండవ రౌండుటేబిల్ సమావేశము విఫలమై పోయినదనే నానమ్మకము. మూడవ సమావేశ మెప్పుడో ఏర్పాటుచేస్తారట! కాని ఏమిలాభము? ఆ మూడవ సమావేశముకూడ ఈ శ్వేతపత్ర నిబంధనలను మార్చలేదు. ఈ నిబంధనలను అతిక్రమించి బ్రిటిష్‌వారు మనకు త్రవ్వి తలకెత్తునది పూజ్యము. ప్రస్తుతము త్రోసివేయబడిన కాంగ్రెసు కోరికలను ఒక్కటికూడ మనకు ఒనగూడగలదన్న యాశ నాకులేదు.

కాంగ్రెసుకు అవమానము.

రెండవ రౌండుటేబిల్ సమావేశము విఫలమైనదని మరొకసారి నొక్కి చెప్పుచున్నాను. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగిన నాటినుండియు బ్రిటిషువారు బహుజాగ్రత్తతో అసామాన్య రాజనీతి వైశిద్యమును ప్రదర్శించుచు, అతి చాకచక్యముగ మెలగినారు. చివరకు వారిదేపై చేయి యైనది.

"గాంధీ - ఇర్విన్ ఒడంబడిక కావించుకొనుటకై గాంధీజీ తప్పటడుగు వేసినాడనియే నాయభిప్రాయము. ఆ యొడంబడికను బ్రిటిషువారు కేవలము ఒక కాగితము ముక్కగా మాత్రమే పరిగణించినారు. కాంగ్రెసు దేశనాయకులు ఆ యొడంబడిక షరతులను చింతాకు వాసియైన అతిక్రమించలేదు; తమధర్మనిరతిని ప్రదర్శించినారు. ఇండియాలోని బ్రిటిషు యధికారులు సైతము దానిని నిర్లక్ష్యము చేసినారు. ఈ గాంధీ - ఇర్విన్ ఒడంబడిక బ్రిటిషు కూట రాజనీతికి ఒకచక్కని నిదర్శనము.

గాంధీ - ఇర్విన్ ఒడంబడిక జరిగిన దాదిగ కాంగ్రెసు చరిత్రలో ఒక విషాదాంత ప్రకరణము నడచినది. కాంగ్రెసు, కాంగ్రెసు నాయకులు అనేక అవమానములను సహింపవలసి వచ్చినది.

రౌండుటేబిల్ సమావేసములో బ్రిటిషువారు తమనాటకమును కడు చాకచక్యముగ ఆడినారు. భారతదేశ ప్రతినిధులకు ఇష్టమున్నను, లేకపోయినను మతసమస్య చర్చించ వలసివచ్చినది.

తత్ఫలితముగ బ్రిటిషువారు అంతర్జాతీయ ప్రపంచములో తమ కనుకూలముగ ... ప్రత్యక్షముగ గాకపోయినను ... కొంత ప్రచారము చేసుకొనగలిగినారు. 'ఔను బ్రిటిషువారు సహృదయముతోనే ఉన్నారు. భారతీయులకు స్వరాజ్య మివ్వవలయుననియే వారికోరిక. కాని భారతీయులలో చాల విభేదాలు ఉన్నవి. వారిలో ఐకమత్యములేదు. తమకు ఏమి కావలెనో వారికేతెలియదు. కాబట్టి ఇంకా కొంతకాలము బ్రిటిషు పాలనమే యథాతథముగ సాగవలసి యున్నది. అదియే భారతీయులకు క్షేమంకరము' అని ఇతర దేశాలవారు అనుకొనునట్లు రౌండుటేబిల్ సమావేశ వ్యవహారములు సాగినవి.

గాంధీమహాత్ముడు సమద్దేశముతో, విశాలాశయములతో సమావేశమునకు హాజరై పాల్గొన్నాడు. భారతదేశ సౌభాగ్యమే ఏకైకలక్ష్య

ముగా అచ్చట తాను చేతనైనంత సేవచేసినాడు. ఎన్ని అవమానములు జరిగినను అన్నియు దిగమ్రింగి ఊరకున్నాడు. తనకును, వైస్రాయికిని జరిగిన సంధిని ఒక శాశ్వత ఒడంబడికగా చేయనెంచి యాతడు లండన్‌కు వెళ్ళినాడు. అందునిమిత్తము అతడు సమావేశములోను, సమావేశమునకు బైటను అనేక ప్రకటనలు చేసినాడు. ఆ ప్రకటనములు కొన్నియంశములలో కాంగ్రెసు విధానమునకుగూడ వ్యతిరేకములయ్యెను. అందుచేతనే బ్రిటిషు రాజకీయవేత్తలు కాంగ్రెసును ఒక బలవత్తరమైన సంస్థగా గుర్తించలేకపోయినారు. సమావేశము విఫలమైనది.

**గాంధీజీ తొందరపాటు**

అసలు గాంధీజీ తొందరపడియే ఇర్విన్‌తో ఒడంబడిక గావించుకొని శాసనోల్లంఘనోద్యమమును ఉపసంహరించినాడని నాయభిప్రాయము. ఆయొడంబడిక షరతులు విస్పష్టంగాలేవు. 'ఇండియాకు క్షేమంకరములైన నిబంధనలు' అన్నపదము మాత్రము బ్రిటిషు వారికి అనుకూలముగ విస్పష్టముగానే యున్నది.

ఈ యొడంబడిక బ్రిటిష్ ప్రభుత్వమునకును, కాంగ్రెసునకును జరిగిన ఏదైన 'నిబంధనము' విషయములో ఇరుపక్షముల వారికిని అభిప్రాయభేదము లేర్పడవచ్చును. ఒకానొక నిబంధనము దేశమునకు క్షేమంకరమని బ్రిటిష్ ప్రభుత్వము చెప్పును. 'కాదు; అది దేశమునకు అపాయకర' మని కాంగ్రెసు చెప్పును. అప్పుడేమి చేయవలయునో ఆ యొడంబడికలో నిర్వచితము కాలేదు.

అట్టి వివాదము సంభవించినప్పుడా సమస్యను ఒక నిష్పాక్షిక సంఘనిర్ణయమునకు వదలి వేయుట సమంజసము. కాని అట్లు జరుగలేదు. ఆ యొడంబడికతో కాంగ్రెసు తన శాసనోల్లంఘనోద్యమమును ఉపసంహరించుకొన్నది; విదేశవస్తు బహిష్కరణ ప్రచారమునుకూడ మానుకొన్నది. బ్రిటిష్‌వారికి అంతవరకే కావలసినది. అది జరిగినది. వారు సంతసించినారు. 'అమ్మయ్య!' అని నిట్టూర్పు విడిచినారు.

కాని ఇట్లు జరుగుటయే ఒకందుకు మంచిదేమో! ఇప్పుడు భారత దేశము బ్రిటిష్ కామన్వెల్తులో సమానప్రతిపత్తిని కోరినను బ్రిటిష్ ప్రభుత్వము కాదు పొమ్మన్నది. ఇది భారత యువకులకు అత్యంత లజ్జాకరమైనది. మున్ముందు బ్రిటన్ ఇండియాకు అట్టి సమానప్రతిపత్తి నిచ్చెద మని వారేయనవచ్చును. అప్పుడు భారతీయులు 'మాకక్కరలేదు; మీతో

సంబంధములేని సంపూర్ణ స్వాతంత్రమే కావలెనని భీష్మించి కూర్చొనగలరేమో !

ఫెడరల్ రాజ్యాంగ విధానము

ఇక రౌండు టేబిల్ సమావేశములో ప్రతిపాదితమైన ఫెడరల్ రాజ్యాంగ విధానమునుగురించి నాలుగు మాటలు చెప్పెదను.

ఈ ఫెడరేషన్‌లో సంస్థానాధీశులు చేరగలరన్న విశ్వాసము నాకు లేదు. అట్టి శుభసమయమునకై భారతదేశ మింకను కొన్ని సంవత్సరములు తపస్సు చేయవలసియున్నది. ఈ లోపున రాష్ట్రీయ స్వపరిపాలనము (Provincial autonomy) అమలు కావచ్చును.

ఈ ఫెడరల్ రాజ్యాంగ విధానమును బ్రిటిష్ ఇండియాలో ప్రవేశపెట్టవలసినదేయనియు, సంస్థానాధీశులు భారతఫెడరేషన్‌లో తమ యిష్టమువచ్చినప్పుడు చేరుటకు అవకాశ ముండవలెననియు నేనేనాడో చెప్పితిని.

రౌండుటేబిల్ సమావేశమునకు హాజరైన బ్రిటిష్‌ఇండియా ప్రతినిధులు ఫెడరల్ రాజ్యాంగ విధానముపై మోజుపడినారు. సంస్థానాధీశులుకూడ అందు చేరిన బాగుండునని యాశించినారు. అందుచేత వారు సంస్థానాధీశులకు ఏవేవో చాల హామీలుఇచ్చినారు. చివరకు వారు సూచించిన ఫెడరల్ రాజ్యాంగము ప్రస్తుత ప్రభుత్వ విధానముకన్న అధ్వాన్నముగ తయారైనది. దేశరక్షణ, విదేశాంగ వ్యవహారములుకూడ ప్రజామంత్రుల అధీనముచేసినను అట్టి ఫెడరల్ రాజ్యాంగ విధానములో స్థాపితముకాగల శాసనసభలు కాంగ్రెసువారి అభ్యుదయ భావాలను ఆచరణలో పెట్టగలుగుట అసంభవమే.

అట్టి రాజ్యాంగముద్వారా గాంధిజీ ఉప్పుపన్నును రద్దుచేయగలడా? మిలటరీ ఖర్చును తగ్గించగలడా? బ్రిటిష్ సైనికులనుగాని, భారత సైనికులనుగాని, ఒకానొక ఉద్యోగి పెన్షన్‌నుగాని తగ్గించవలెనన్న తీర్మానమునకు అనుకూలముగ వోటు చేయించగలడా?

కేంద్రప్రభుత్వ ఖర్చును ఏ విధంగానూ తగ్గించేందుకు వీలులేని పరిస్థితులలో, రాష్ట్రీయస్వపరి పాలనముండి మాత్రము మనము 'మద్యనిషేధము' 'భూమిశిస్తులు తగ్గించుట' మొదలైన ఉన్నతాశయాలను సాధించుకొనుట యెట్లుసాధ్యమగును?

ఇండియా పరిస్థితులు తప్పని సరిగ ఒక ప్రజావిప్లవమునకు దారి తీయుచున్నవి. సందేహము లేదు. అది తప్పవలెనన్న ప్రభుత్వ నిర్వాహణ బాధ్యతలు చాలవరకు కూడు లేక మాడిపోవుచున్న కార్మికులకు, కర్షకులకు ఒప్పజెప్పవలసినదే. గాని రౌండుటేబిల్ పెద్దలు అట్లు చేయలేరు. Upper House లో 200 మందలనుంచి సభ్యులు. వారిలో 80 మంది సంస్థానాధీశుల నియమితులట! ప్రజాశాసన సభలో మొత్తము 300 మంది వీరిలో నూరుగురికి ప్రత్యేక ప్రాతినిధ్యము — జమీందారులు, వర్తక వ్యాపారస్థులు మొదలగువారికి అనగా దేశపరిపాలనా చక్రము చాల వరకు సంస్థానాధీశులు, జమీందారులు- ధనస్వాములు మొదలగువారి భుజస్కంధాల మీదకి వెళ్ళినదన్నమాట !

అనేక కారణాలు పురస్కరించుకొని సంస్థానాలు భారత ఫెడరేషన్‌లో చేరుటకు ఇప్పుడు అంగీకరించవు కనుక, బ్రిటిషుఇండియాలో మాత్రమే ఈ ఫెడరేషన్ అమలు పరచుట వాంఛనీయము. సంస్థానాధీసుల ప్రమేయము ప్రస్తుతము మనకు పెట్టుకోనవద్దు. కాని బ్రిటిషు ప్రభుత్వమందుకు అంగీకరించదుగా! అఖిలభారత ఫెడరేషన్ పద్ధతిని కేంద్ర స్వపరిపాలనము భారతీయుల హస్తగతము చేయబడునని వారు ఖండితముగ చెప్పివైచిరి.

బ్రిటన్ నైఖరి.

ఇంకను బ్రిటిషు పెద్దలతో సంప్రదింపులకు ప్రయత్నించి లాభము లేదు. గాంధీజీ లండన్ వెళ్ళి డౌనింగ్ వీధిలోను, సెంటు జేమ్సు భవనములోను చేయవలసినదంతయు చేసినాడు; ఫలించలేదు. ఇంకను అట్టి ప్రయత్నాల వలన ప్రయోజనముండునని నేననుకోను. ఆరు వేల మైళ్ళదూరమున ఇండియాలో ఉండు గాంధీజీయైనను ఆవిషయములో చేయదగినది లేదు.

గాంధీజీ యేమైన చెప్పుగాక! గాంధీ - ఇర్విన్ ఒడంబడిక మాత్రము ఆయన చేసిన పెద్ద పొరపాటే.

గాంధీకి ఇంగ్లండు వెళ్ళుట వలనగాని, అక్కడ ఆయన కావించిన కృషిఫలితముగ గాని కాంగ్రెసు ప్రతిష్ఠ అధికము కాలేదు. పైపెచ్చు బహుళ సంఖ్యాక ప్రాతినిధ్యము గలిగిన కాంగ్రెసుకు - భారత స్వాతంత్ర్య సముపార్జన నిమిత్తము మహాత్యాగములు చేసిన కాంగ్రెసుకు అవమానములే జరిగినవి.

ఈ పోయిన ప్రతిష్ఠను కాంగ్రెసు తిరిగి ఆర్జించుకొనవలసి యున్నది. కాంగ్రెసు ఇకముందు అందుకోసమై యేమిచేయ నున్నదో చూడవలసియున్నది. బహుశః మరొక మహోత్సవమును సాగించుముందు మతసమస్యా పరిష్కారమునకై పాటుపడు ననుకొందును" పైని వివరించిన విధమున విఠల్‌భాయి పటేల్ రౌండుటేబిల్ సమావేశ వ్యవహారములను నిశితదృష్టితో సమాలోచించినాడు.

**పటేల్ అమెరికా ప్రయాణము**

గాంధీ - ఇర్విన్ ఒడంబడికతో ప్రభుత్వమునకును ప్రజలకును సంఘర్షణ తాత్కాలికముగ ఆగిపోయినను, రౌండు టేబిల్ సమావేశము భగ్నమైనందున ఇరుపక్షములవారికి మైత్రి మాత్రము కుదురలేదు.

గాంధిజీ ఇండియాకు తిరిగి వచ్చుటతోనే మరల సత్యాగ్రహకాలు ఆరంభమైనవి. విఠల్‌భాయ్ కూడ గాంధిజీతో తిరిగి వచ్చినాడు. వైస్రాయి ఆర్డినెన్సుకు గురియైనాడు. కాని అప్పటికాతడు చాల బలహీనముగ నుండెను. జైలులో ఆరోగ్యము మరల చెడిపోయెను. అందుచే ప్రభుత్వము వారితనిని విడుదలచేసినారు.

విడుదలయైన వెంటనే విఠల్‌భాయ్ మరల వియన్నాకు పయనమై వెళ్ళెను. అక్కడ కొన్నాళ్ళు చికిత్సపొంది కొంతవరకు శరీరారోగ్యము చేకూరిన తరువాత విశ్రాంతికై అచ్చటనుండి ఇంగ్లండునకు వెళ్ళెను.

కాని భారతదేశ రాజకీయ సమస్య అతనిని వెన్నాడుచునే యుండెను. ఇంగ్లండునుండి యాతడు అమెరికాకు వెళ్ళినాడు. అచ్చట నున్నన్నాళ్ళు భారతజాతీయ ఆశయాలను చాలవరకు ప్రచారము చేసినాడు.

---

# 7

## అమెరికాలో ఇండియారాయబారి

స్వాతంత్ర్య సంపాదనకు జాతీయశక్తుల సమీకరణము ఎంత ముఖ్యమో, అంతర్జాతీయ సానుభూతికూడ అంత అవశ్యకమే. మన స్వాతంత్ర్య సమరమునకు పరదేశీయుల నైతికమైన తోడ్పాటు ఉండవలె కదా! అందుకు విదేశములలో ఇండియా ఆశయముల సామంజస్యము ప్రచారము కావలసినదే. విఠల్ భాయ్ పటేలు అమెరికా వెళ్ళినప్పుడు అట్టికార్యమును జయప్రదముగ సాగించుకొని వచ్చెను.

అప్పుడప్పుడు ప్రముఖ భారతీయవ్యక్తులను దర్శించు మహాభాగ్యము అమెరికాకు లభించుచు వచ్చినది. వివేకానందస్వామి, ప్రతాప్ మజుందార్, లాలా లజపత్ రాయ్, సర్, జే. సి. బోస్, శ్రీమతి సరోజినీ నాయుడు, విశ్వకవి రవీంద్రనాథటాగూర్ మొదలగువారు అమెరికాలో పాదముపెట్టివచ్చినారు.

వారివలన భారతదేశ ప్రాచీన ప్రాశస్త్యము, విజ్ఞానసంస్కృతులు, నాగరికతా సౌభాగ్యములు అమెరికా ప్రజలు వినియున్నారు. బ్రిటిషు వారు అమెరికాలో భారతదేశమునుగురించి అబద్ధప్రచారము చేయుచునే యున్నారు. ఈ దేశమున హిందూ-ముస్లిములు అస్తమానము గిల్లి కజ్జాలు పెట్టుకొని పోట్లాడుచుందురనియు, స్వపరిపాలనా బాధ్యతలు నిర్వహించుకొను సామర్థ్యము వారికి లేదనియు, బ్రిటిషువారీదేశము విడిచి వెళ్ళినచో వివిధపార్టీలవారు తమలోతాము అంతర్యుద్ధాలు పెట్టుకుని అంతయు అరాజకము చేసి వైతురనియు—ఈ విధముగ బ్రిటిషువారి ప్రచారము అమెరికాలో అవ్యాహతముగ నేటికూడ సాగుచునేయున్నది. అయినను విఠల్ భాయ్ పటేల్ వంటి ధీరోదాత్తులు ఆదేశములో భారతీయ యథార్థ పరిస్థితులను చాటివచ్చినారు. వారి కృషివలన కొంతవరకైనను ఈనాటికి భారతదేశమునుగురించి చాలమంది అమెరికనులకు కనువిప్పయినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము సాన్‌ఫ్రాన్సిస్కో సభలు జరుగుచున్న తరుణమున శ్రీమతి విజయలక్ష్మీపండిట్ అమెరికాలో ఉండి భారతదేశమునకు చేసిన సేవ మరువరానిది.

అమెరికా ప్రయాణము

1932 నవంబరులో విఠల్‌భాయ్ అమెరికాకు వెళ్ళెను. ఇండియాలో కారాగారవాసము, యూరప్‌లో నాలుగు అపరేషనులు అతని యారోగ్యమును భంగముచేసెను. అయినను అతడు అమెరికాలో ఉన్నన్నాళ్లు అచ్చటిప్రజలకు భారతదేశ యదార్థపరిస్థితులను తెలుపుచు మాతృదేశమునకు ఎంతో సేవచేసెను.

అమెరికనులతనికి మహాగౌరవముగ స్వాగతము లిచ్చినారు. న్యూయార్కు, ఫిలడల్ఫియా, బాల్టిమోర్, బోస్టన్, డెట్రాయిట్, వాషింగ్‌టన్ మొదలగు గొప్పగొప్ప పట్టణముల మేయర్లు అతనికి హృదయపూర్వక స్వాగతములిచ్చి గౌరవించిరి.

బొంబాయి మేయరుగాను, ఢిల్లీ అసెంబ్లీ స్పీకరుగాను విఠల్‌భాయ్ భారతదేశమునకు కలిగించిన సేవ అనేక ప్రముఖ అమెరికన్ పత్రికలలో ప్రచురితమైనది.

విఠల్‌భాయ్ దేశమంతయు సంచారముచేసి అనేకచోట్ల — కాలేజీలలో, చర్చిలలో, క్లబ్బులలో, మందిరములలో, వివిధసంస్థల సమావేశములలో పలు ఉపన్యాసము లిచ్చెను. ప్రస్తుతః వాక్చమత్కృతి గలవక్త. గంగాప్రవాహము వంటి వాగ్ధార. సమగ్రముగ విషయసంగ్రహము చేసినవాడు. ఇక శ్రోతల కేమి తక్కువ? ప్రజలు తండోపతండములుగ అతని యుపన్యాసములకు హాజరయ్యెడి వారట.

భారతప్రజల స్వాతంత్ర్య వాంఛ ఎంతన్యాయబద్ధమైనదో అతడా ప్రజలకు సుస్పష్టము చేసినాడు. నిర్భయముగ, శక్తివంతముగ, తేటతెల్లముగ భారతీయుల పక్షమున వాదించి, అమెరికన్లను నమ్మించినాడు. అతని యుపన్యాసములచే, అతనితోడి సంభాషణలచే వారెంతయు ప్రభావితులైనారు.

వాస్సార్ కాలేజీ ఉపన్యాసము

ఒకసారి విఠల్‌భాయ్ 'వాస్సార్' కాలేజీలో ఉపన్యసించుట సంభవించెను. అది స్త్రీలకు ఉన్నత విద్యగరపుచుండిన విద్యాసంస్థ. అతిపురాతనమైనది. ఆనాటి యతని యుపన్యా

సము ఎంతో రక్తికట్టినది. చిన్నలు, పెద్దలు నోళ్ళు తెరచుకొని తన్మయులై విన్నారు. అట్టి వాగమృతము వారెన్నడు గ్రోలినది కాదు. ఉత్సాహము, ఆనందము, ఆవేశము ఆపుకొనలేక పోయినారు. ఉపన్యాసానంతరము వారి కరతాళధ్వనులు మిన్నుముట్టినవి. ఎంతసేపటికి ఆగలేదు.

అనంత ప్రాచీన వైభవముగల ఈ చరిత్రాత్మక భరతఖండము నిజముగా స్వపరిపాలనకు అర్హతకలిగి యున్నది; తక్షణమే భారతీయులకు స్వపరిపాలనా బాధ్యతలు ఒప్పగించివేయవలసినదే - అన్న నమ్మకమును వేలకొలది అమెరికన్ ప్రజలహృదయాలలో ఉత్పన్నము చేసినాడు విఠల్‌భాయ్— తనయుపన్యాసములతో.

అతడు అమెరికాలో ఆరుమాసములుండెను. ఆ స్వల్పకాలములో అతడు ఎంతయో పనిచేసెను. అతడొకసారి అమెరికానుండి స్వదేశము నందున్న ఒక మిత్రునకిట్లు లేఖవ్రాసెను:

“నేనింతవరకు ఈదేశములో 85 ఉపన్యాసము లిచ్చినాను. అనేకమంది ప్రముఖవ్యక్తులు పరిచయమైనారు. పలుకుబడిగల అనేక సంస్థలతో కూడ పరిచయము సంపాదించుకొన్నాను. ఇటీవల బాల్టిమోర్‌లో విదేశాంగ విధానసంస్థ (Foreign Policy Association) వారి యాజమాన్యమున ఒక పెద్దసభ జరిగెను. ఆసభకు అన్ని తరగతులవారు అన్ని పక్షములవారు హాజరైనారు. ఆసభలో నాకును, నాకుపూర్వము ఢిల్లీఅసెంబ్లీ అధికార అధ్యక్షునిగానుండిన సర్ ఫ్రెడరిక్ వైట్‌కును చర్చ (Debate) జరిగినది. అసలు మా చర్చకొరకే ఆసభ ఏర్పాటుగావింపబడినది. వచ్చు మార్చి 11 తేదీని నాకును, ఇంతకుముందు ఇండియా కార్యదర్శిగానుండిన వెడ్జివుడ్ బెన్‌కును న్యూయార్కులో సభ జరుగగలదు. ఆ సమావేశమును న్యూయార్కు విదేశాంగవిధాన సంస్థ (Foreign Policy Association) వారు ఏర్పరుప నున్నారు. ఆకార్యక్రమము ముగియగానే అమెరికానుండి డబ్లిన్, లండన్, జెనీవా, వియన్నా పట్నాలనుచూచి చివరకు ఇండియాజైలులో వచ్చిపడియెదను. ఇక్కడ ఇంతవరకు నాపనియంతయు ఒక్కడనే చేసుకొనుచున్నాను. తృప్తికరముగనే సాగుచున్నది....”

**అమెరికాలో భారత ప్రచారము:**

నిజముగా తాను ఒక్కడే. అందును అనారోగ్యస్థితిలో నున్నాడు అవతల బ్రిటిషు వారి వ్యతిరేక ప్రచారశాఖ తీవ్రముగ పని చేయుచున్నది. అయిననేమి? మొక్కవోని

ధైర్యసాహసములు గలవాడు. అకుంఠిత దేశభక్తుడు. తాను చేయుచున్నది ధర్మకార్యమన్న విశ్వాసమాతనికి వెయ్యియేనుగుల బలము చేకూర్చినది.

అమెరికనుల హృదయాలలో ఇండియాపట్ల సదుద్దేశములను మొలకెత్తించుట సాధారణమైన కృషికాదు. భారతజాతీయ వాదులకు ప్రపంచ ప్రజల సానుభూతి లేకుండ చేయవలనన్న తలంపుతో బ్రిటిషు కన్సర్వేటివులు చేయవలసిన దుష్ప్రచారమంతయు చేయుచు, అమెరికా ప్రజల హృదయాలను పాడుచేసి యున్నారు.

ఇట్టి దుష్ప్రచారముల ఫలితముగ ఉద్భవించిన వారే మేయో సతి వంటి రచయితలు. మేయోసతి Mother India అను గ్రంథము వ్రాసినది. భారతీయుల సాంఘిక దురాచారములను గోరింతలు కొండంతలుగా వర్ణించి, ప్రపంచ ప్రజలకు ఇండియాయెడల ఒక ఏహ్యాభావమును పుట్టించుటయే ఆమె ఆశయము. అంతటి అనాగరిక స్థితిలో ఉన్న భారతీయులు స్వపరిపాలనము కోరుచున్నారుగాని అందుకువారు నిజముగా అర్హులుకారు — అని నిరూపించుటయే ఆ రచయిత్రి మహదాశయము.

ఇట్లు భారతదేశమునకు అశుభమే కోరువారు మిస్ మేయో వంటి విదేశీయులే కాదు; మనదేశీయులు కూడా కొందరున్నారు. మహారాజ ధీరజ్ విజయచంద్ మొహతాబ్ అమెరికాకు వెళ్ళి కొన్ని యుపన్యాసము లిచ్చివచ్చినాడు. ఆయుపన్యాసములలో భారతీయుల స్వాతంత్ర్యాశములు గణనీయములు కావని వక్కాణించినాడు. తనదేశీయుల జాతీయ శక్తులను తృణప్రాయముగ వివరించినాడు. తద్వారా బ్రిటిషు కన్సర్వేటివ్ ప్రచారమునకు ఎంతయైన ఉపయోగ పడినాడా మహనీయుడు.

ఇట్టి వారందరును భారత స్వాతంత్ర్య పిపాసువులకు శత్రువులనవలె. వీరియుపన్యాసాల వలన, రచనలవలన అమెరికన్ ప్రజలు ఇండియాను గురించి ఎట్టిభావములు కలిగియుందురో ఊహించుకొన వచ్చును. మిస్ మేయో, విజయచంద్ మొహతాబ్ మొదలైనవారి పలుకులన్నియు కల్లలని నిరూపించి, ప్రజలను నమ్మించి ఇండియాను గురించిన యథార్థ స్థితిగతులను వారిమనసున కెక్కించుట కష్టసాధ్యము కదా! అయినను విఠల్‌భాయి పట్టుదలతో దేశమంతయు పర్యటనముచేసి, ఉపన్యాసము లిచ్చి భారత జాతీయత, దానిస్వరూపము వివరించి అమెరికన్ ప్రజలను ఇండియాయెడ సుముఖులను చేయగలిగినాడు.

న్యూయార్కులో స్టేటుభవనము చాలపెద్దది. దాని శిఖరములు ఆకాశము నొరయుచుండును. ఒకసారి విఠల్ భాయ్ ఆభవనము పైయంతస్తునకు తీసుకొనిపోబడెను. అచ్చటనుండి న్యూయార్కు పట్టణమునంతయుదర్శించి యిట్లనెను— "అంతయు బాగుగనేయున్నది. ఈ యెత్తయిన చోటునుండి పట్టణ దృశ్యము అద్భుతముగనున్నది. కాని నాకు నా దేశమునకుపోయి, ఆపూరిపాకలలోనే నివసించుచు, భారతస్వాతంత్ర్య సిద్ధికి కృషిచేయవలెననియే ఉబలాట పడుచున్నాను"

ఒక్క అమెరికాలోనేకాదు, విఠల్ భాయ్ ఏ పరదేశమేగినను భారతస్వాతంత్ర్య సమస్యను ప్రచారముచేసినాడు. 'బ్రిటీషువాడు స్వేచ్ఛాప్రియుడు! స్వేచ్ఛ అతనికి జన్మహక్కు! ఆసియావాసులకుమాత్రం స్వాతంత్ర్యము జన్మహక్కు కాదేం?' అని వాదించుచుండెడివాడు.

**రేడియో ఉపన్యాసము**

అమెరికాలో ఒకసారి విఠల్ భాయ్‌కి రేడియో ఉపన్యాసమిచ్చు అవకాశము లభించెను. ఆ యుపన్యాసములో అతను అమెరికనుల స్నేహమును, సహకారమును అర్థించుచు విజ్ఞప్తిగావించెను. అమెరికా స్వాతంత్ర్యదేశము; అమెరికనులు స్వాతంత్ర్య ప్రియులు; కనుక వారు అవకాశము లభించినప్పుడు, అవసరమైనప్పుడు బానిస దేశాలకు అండగానిల్చి వారి స్వాతంత్ర్యసిద్ధికి తోడుపడవలె. ప్రపంచములో అమెరికా ఎనలేని కీర్తిప్రతిష్ఠలు ఆర్జించుకొన్నది; అంతర్జాతీయముగ ఒక ఉన్నత స్థానమలంకరించినది; ఎంతో పలుకుబడి సంపాదించుకొన్నది. కనుక ఈ దేశము వలసరాజ్యాల, బానిసదేశాల, పీడితజాతుల భావి అభ్యుదయమునకు సాయపడగలదని పటేల్ ఆశించినాడు. ఆతని రేడియో యుపన్యాసములోని కొన్ని భాగములిచట ఉదాహృతములగుచున్నవి—

"అమెరికను సోదర సోదరీమణులకు నేనిప్పుడు ఉపన్యసించుచున్నాను. అమెరికా వయసున చిన్నదైనను, ఆధునిక నాగరికతా ప్రపంచమున పురోగామి; అభ్యుదయమార్గమున అగ్రేసరురాలు. ఇది స్వాతంత్ర్యదేశము. అమెరికా స్వాతంత్ర్యమునకు మూలపురుషుడు జార్జివాషింగ్టన్ ఇక్కడ జన్మించినాడు. వ్యక్తిస్వాతంత్ర్య పక్షపాతి, బానిసత్వమును రూపుమాపినవాడు అబ్రహామ్ లింకోలన్‌ను ప్రసవించిన పుణ్యదేశమిది.

మీకును బ్రిటిషువారికిని రక్తసంబంధం ఉన్నమాట నేనెరుగుదును. బ్రిటనులో సామ్రాజ్యతత్వము జీర్ణించిపోయినది. ఆ సామ్రాజ్య

తత్వమును అమెరికనులెవరును హర్షించెదరని నేననుకొనను. బ్రిట నుతో పోరాడియే మీరు స్వాతంత్ర్యము బడసినారు. స్వాతంత్ర్య ములభించిన నాటినుండియే మీజాతీయజీవితము ఆరంభమైనది. బ్రిటను యెడ మీకుండు అభిమానముకన్న మీ స్వాతంత్ర్య ప్రియత్వమే గొప్పది.

కనుక సామ్రాజ్యవిధానము వలని అనర్థాలను నేను మీకు నిస్సం కోచముగ చెప్పవచ్చును. అది ప్రపంచమునకొక శాపమువంటిది. దాని బారిబడి ప్రత్యక్షముగ బాధపడుచున్నది భారతదేశము. కాని ప్రపంచ మంతయు కూడ దానివలన పరోక్షముగ బాధపడుచునే యున్నది.

సామ్రాజ్య విధానమొక భయంకరమైన అంటుజాడ్యము వంటిది. అది క్రమేణ ప్రపంచమంతయు ప్రాకుచున్నది. ప్రపంచ ఆర్థిక సంక్షోభ మునకు సామ్రాజ్య విధానమే ఆదికారణము.

**ప్రపంచానర్థముల మూలహేతువు**

ఇటీవలనే జరిగిన సంఘటన యొకటి యుదాహరణముగ తీసుకొనవచ్చును. బ్రిటన్-అమెరికాల సఖ్యమునకు విరుద్ధముగ, ఇంగ్లీషు ఏకభాషగ వ్యవహృతమౌతున్న రెండుదేశాల యైక్యతను ప్రతిపాదించు ఆశయమునకు విరుద్ధముగ అట్టావా సమావేశము జరిగినది. అది సామ్రాజ్యవాదుల సమావేశము. ప్రపంచమునకది ఏమంత లాభదాయకమని? నిజమునకది యొక యుద్ధకౌన్సిల్ సమావేశ మన్నమాట! ప్రపంచమంతయు ఆర్థిక సంక్షోభములో అల్లకల్లోల మగుచుండ అట్టావాలో యుద్ధము ప్రత్యక్షమైనది.

మా చేనేతపరిశ్రమ, నౌకానిర్మాణ పరిశ్రమ నాశనమైపోయినవి. సకలకళాభ్యున్నతి నందిన మాదేశము, వ్యాపారపరిశ్రలకు నిలయమైన మాదేశము నేడు కేవలమొక వ్యావసాయిక దేశమైపోయినది. అవ్యవ సాయమైనను తృప్తికరముగ సాగుటలేదు. మంచివ్యవసాయ పనిముట్లు లేవు. సంవత్సరము మొత్తము మీద ఇరువది డాలర్ల ఫలసాయము కూడ రాని లక్షలాది యెకరములభూమి పడియున్నది. అవమానములకు, అత్యా చారములకు గురియైనాము. స్వపరిపాలన బ్రిటిషు డొమినియనులలో కూడ మాకు అవమానములే. ప్రపంచ దృష్టిలో మేము అస్పృశ్యులమై పోయి నాము. వలసరాజ్యాలలో మాకు పౌరసత్వపు హక్కులు కూడలేవు. ఆస్తి పాస్తులు కూడ సంపాదించుకొనుటకు వీలులేదు. వలస దేశాలలోని

శ్వేత జాతులకు ఇండ్లుకట్టుటకు, భూములు సాగుచేయుటకు మమ్ములను పిలుచుకొనిపోయి, తమ పనియైన తరువాత వెడల నడిపెదరు. బ్రిటిషుడో మినియనులలో భారతీయులకన్న పరదేశీయులే ఎక్కువ హక్కులు కలిగియున్నారు. అంతర్జాతీయ సభలలో మా హక్కు వినిపించకూడదు. మా తరపున బ్రిటిషు వారే వ్యవహరించెదరు. మాగోడు మాగుండెలలో ఇగిరిపోవలె. జినీవాలోగాని, ఆట్టావాలోగాని, లండన్ రౌండుటేబిల్ సమావేశములోగాని భారతీయ ప్రజాప్రతినిధు లెవరూ ఉండరు కదా! బ్రిటిషు తాబేదారులే బ్రిటిషువారికీ అనుకూలంగా చిలుక పలుకులు పలికి వచ్చివేయుదురు.

ఈ ప్రపంచానర్థములకన్నిటికి మూలకారణము సామ్రాజ్యవిధానమే అని మీకు నచ్చజెప్పుటయే నా యీ చిన్న ఉపన్యాసములోని ముఖ్యోద్దేశము. ప్రపంచమునకు ఎక్కడ పుండు పుట్టినదో నేను మీకు చెప్పెదను. నాతో మా దేశమునకు వచ్చి చూడండి. నా కిటికీగుండ మీరు ప్రపంచమును తిలకించండి. ఆ కిటికీగుండా చూచినప్పుడు ప్రధానద్రవ్యముల ధరలు ఎందుకు పడిపోయినవో మీకు ముఖ్యకారణము తెలియగలదు. భారతదేశమును చూచినచో మీరు ఆసియా ఖండమంతయును చూచినట్లై. సామ్రాజ్యవిధానము ఒక్క దారిద్ర్యమునే కాదు; మృత్యువును, వినాశమును కూడా తెచ్చిపెట్టుచున్నది.

ఒకప్పుడు మాది ఎంతో భాగ్యవంతమగు దేశము. ఇప్పుడు కరువు కాటకాలతో నిండియున్నది. బ్రిటిషువారు మా దేశములో అడుగుపెట్టినప్పటినుండి నేటివరకు మాకు కలిగిన ధననష్టము ముప్పదివేల మిలియనుల డాలర్లు అని కొందరు లెక్కవేసినారు. భారతీయులు ఈర్ష్యాపూరితులై బ్రిటిషువారితో పోరాడుటలేదు. ఆత్మపోషణ, ఆత్మవికాసము సృష్టిలో ప్రతిజాతికి కావలసినదే.

మాకు స్వాతంత్ర్యము లభించుట మా ఒక్కరి మేలునకే కాదు. భారతస్వాతంత్ర్యమే ప్రపంచ శాంతి భద్రతలకు ఉత్తరదాత.”

### భారత దేశము: బ్రిటిష్ సామ్రాజ్యము

ఈ విధముగ ఆవకాశము లభించినప్పుడెల్ల బ్రిటిషు పరిపాలనలో భారతదేశ మనుభవించుచున్న కష్టపరంపరలను అమెరికన్ ప్రజలకు ఎరుకపరచినాడు. భారత స్వాతంత్ర్యము లేనిదే ప్రపంచ శాంతి గగనకుసుమమని భోధించినాడు.

ఒకసారి పటేల్ చికాగో పట్నంలో ఐరిషు అమెరికనులకు ఉపన్యాసమిచ్చెను. ఆసభలో లక్షలాది భారతప్రజల తరఫున వారిస్వాతంత్ర్య వాంఛను ఉద్ఘాటించెను.

"ప్రపంచ శాంతి సంపాదనకు కృషిచేసి విజయము పొందగల అవకాశములు అమెరికా దేశమునకు గలవు. అమెరికన్లు ఆ యవకాశములను ఉపయోగించుకొనవలె. తమకొరకు కాకపోయినను ఇతర ప్రపంచజాతులకోసమైనను వారందుకు పూనుకొన వలెను.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరము బ్రిటన్ 100,000 చతురపు మైళ్ళ క్రొత్త భూభాగమును సంపాదించుకొన్నది. తనతప్పు తనకు తెలియదు. అమెరికాను 'షైలాక్' (వడ్డీ వ్యాపారస్థుడు) అని పిలుస్తున్నది. ఇతరరాజ్యాలను తాను ఆక్రమించుకొనుట ఆయారాజ్యాల మంచికేనని బ్రిటన్ సమర్థించుకో జూచుచున్నది. ఐర్లండు, ఈజిప్టు, ఆఫ్రికా, ఇంకా అనేక దేశాలలో తిష్టవేసుకొని కూర్చున్నది. ఎందుకు? ఆయాదేశాలను బాగుచెయ్యటానికేనట!

'డీవెలరామాత్రము బ్రిటన్కు పంటిక్రింది పచ్చివక్కయై కూర్చున్నాడు. భూమి శిస్తుల రూపంలో ఐర్లండు మాకు బాకీయున్నదని బ్రిటిషువారు అనుచున్నారు.' సరే, బాగానే ఉన్నది; ఎవరెవరికి బాకీయో లెక్కలు చూచుకొందుము; ఒక నిష్పాక్షిక విచారణ సంఘము నేర్పరచుకొందుము. ఆ సంఘములో ఇంగ్లీషువారు ఉండతగదు" అన్నాడు డివెలరా.

సోదర సోదరీమణులా! నిజముగా ఇంగ్లాండును ఒక నిష్పాక్షిక విచారణ సంఘము నెదుట నిలువబెట్టి ఎవరెవరికి ఎంత బాకీయో తేల్చవలసిన సమయము వచ్చినది. అందుకు అమెరికా పూనుకొనవలసి యున్నది.

నేను ఐర్లండులో పదిరోజులు ఉన్నాను. డివెలిరా, లెమాస్, కల్లీ మొదలైన ప్రముఖులను కలసి మాటాడినాను.

ఐర్లండులో మీరు చాలా ముందుకు పోయినారు. గవర్నరు జనరలు వెళ్ళిపోయినాడు. అతనితోనే ఐర్లండు బ్రిటన్కు కప్పము చెల్లించు ఆచారముకూడ పోగలదు. ఇక 18 మాసములలో బ్రిటన్తో మీకు సంబంధము తెగిపోగలదు. ఐర్లండులో స్వరాజ్యము స్థాపితము కాగలదు; తప్పదు. మా భారతదేశము మాత్రమింకను వెనుకబడియే యున్నది.

రానున్న ఎన్నికలలో ప్రజలందరు డీవెలిరా పక్షము వహించి, అతనిని బలపరచిరేని ఐర్లండునకు స్వాతంత్ర్యము సిద్ధించినవన్న మాట; సందేహము లేదు.

ఇక ఆయుధ విసర్జనము గురించి ఒక మాట. అన్ని జాతులవారు ఆయుధ విసర్జనము చేసినప్పుడే ప్రపంచ శాంతి; నిజమే. కాని సామ్రాజ్యములు ఉన్నంతకాలము ఆయుధ విసర్జనము అసంభవము.

పీడిత జాతులవారు శాశ్వతంగా పాలితజాతులకు లొంగి పడియుండరు. వారు తిరుగబడకుండ అణచిపెట్టి యుంచుటకై పాలకజాతులు ఆయుధపాణులై యుండవలసినదే కదా!

ఎప్పటికైన ట్రిపోలి, సిరియా, ఫిలిఫ్ఫైన్ దీవులు, ఈజిప్టు మందారియా తమతమ పాలక శిఖామణులతో దెబ్బలాడక తప్పదు. కనుక ప్రపంచశాంతి కావలెనంటే సామ్రాజ్యవాద దేశాలు, జపాన్, ఫ్రాన్సు, అమెరికా ఆయుధవిసర్జన చేయవలె. ప్రపంచవర్తకమును గుత్తగొనవలెనని బ్రిటన్ పట్టుపట్టినంత కాలము అవి ఆయుధాలను విసర్జించవు. శత్రురాజ్యాలవారి నౌకాసైన్యము తగ్గవలెనని బ్రిటన్ కోరిక. కాని తనకుమాత్రము 85,000 మైళ్ళ తీరరేఖను రక్షించుకొనుటకు వలసినంత నౌకాసైన్యము కావలెనట!

ఇంగ్లడు ఆయుధ విసర్జనకు సిద్ధముగ నున్నదా? లేనేలేదు. ఇటీవల వాషింగ్టన్‌లో జరిగిన సంధిపత్రముపై సంతకము పెట్టుచూ బ్రిటన్ అన్నమాటలు: 'ఒక్క-షరతుపై ఈ మా సంతకము ఆధారపడియున్నది. బ్రిటిష్ సామ్రాజ్యమునకు ఏవిధమైన ముప్పము రాకూడదు. మాసామ్రాజ్యములో ఒక్క- అంగుళముభూమి పోయినదంటే ఈ సంధికి అంతటితో తిలాంజలులే.

ఇక మా ఇండియావిషయమై నాలుగు మాటలు చెప్పెదను. నూటయేబది సంవత్సరాలనుండి బ్రిటిష్‌వారు ఇండియాను పాలించుచున్నారు; కఠినాతి కఠినములైన శాసనములను చేసినారు. వారి అనుమతిలేకుండ ఎవరును తుపాకి పట్టుకోరాదు. భారతీయులందరిచేత ఆయుధ విసర్జనము చేయించినారు. అదిగాక ఇండియాలో అరువదివేల బ్రిటిష్ సైనికులు అన్నివేళల ఉండవలసినదే. బ్రిటిష్ ఉద్యోగులకు ఎంతెంత జీతాలు ఇచ్చుచున్నారో గమనించండి. వైస్రాయికి నెలకు 5,000 డాలర్లు జీతము, ఇంకను పైన అలవెన్సులు ఉన్నవి. పెద్ద ఉద్యోగాలన్నియు ఇంగ్లీషు

వారికే 'రిజర్వు' చేయుదురు. భారతదేశములో మనిషికి సగటుఆదాయము రోజుకు 5 సెంట్లు. డబ్బంతయు ఇంగ్లీషు ఉద్యోగస్థుల జీతముల క్రిందనే వ్యయమగుచున్నది. దానిఫలిత మెట్లుండునో మీరు ఊహించుకొన వచ్చును.

మూడువందల మిలియనుల భారతీయులకు సంవత్సరము మొత్తము మీద ఎనిమిదినెలలు పనియుండదు. ఎల్లప్పుడును పదిమిలియనులమంది నిరుద్యోగముగ నుండవలసినదే.

రైతులపై పన్నులు బాగుగనే విధించుచున్నారు. కాని నూటికి 87 మంది సరియైన వైద్యసౌకర్యములు లేకపోవుటచేత మరణించుచున్నారు. సంవత్సరమునిండని శిశువులు నూటికి 80మంది మృతినందుచున్నారు. ఇండియాలో 40 మిలియనుల మందికి ఒంటిపూట భోజనమే.

మీరు నాయెడల, నాదేశప్రజలయెడ చూపిన శ్రద్ధావిశేషములకు కృతజ్ఞుడను"

**ఇండియా స్వయం నిర్ణయ హక్కు—**

న్యూయార్కులో విఠల్ భాయ్ పటేలునకు, ఇండియా కార్యదర్శిగానుండిన వెడ్జివుడ్ బెన్ కు ఒకచర్చ జరిగినది. ఇది న్యూయార్కు విదేశాంగవిధానసంస్థ (Foreign Policy Association) వారి యాజమాన్యమున జరిగెను. రేడియోద్వారా ఈ చర్చ బ్రాడ్ కాస్టు చేయబడెను. లక్షలాది ప్రజలు విన్నారు.

నాటిసభకు అగ్రాసనాధిపతిగనుండిన జేమ్సు. జి. మాక్డొనాల్డు విఠల్ భాయ్ ని గురించి పరిచయ వాక్యములు చెప్పినాడు. చర్చ యారంభమయ్యెను. భారత జాతీయ పునరుద్ధరణకు ఆటంకములైయున్న వివిధశక్తులను పేర్కొని విఠల్ భాయ్ ఇట్లు ఉపన్యసించెను—

"ఇండియా ప్రతినిధులు, బ్రిటిషు ప్రతినిధులు సమావేశమై చర్చించుకొని ఒకరాజ్యాంగ ప్రణాళికను నిర్ణయించుకున్నారనియు, అది ఇండియాలో అమలు కాబోవుచున్నదనియు, ప్రపంచమునకు అబద్ధములు చెప్పినారు. ఎవరా ఇండియా ప్రతినిధులు? బ్రిటిష్ ప్రభుత్వము నియమించినవారేకదా! శాసనసభగాని, ఒక రాజకీయపక్షముగాని, కనీసము ఒక మతసంఘముగాని ఎన్నుకొని పంపినవారేకదా! నిజమైన దేశనాయకులను జైళ్ళలో బంధించియుంచి రౌండుటేబిల్ సమావేశ నాటకమును జరిపించినారు...

శాంతిసమావేశములో, నానాజాతి సభలో, అంతర్జాతీయ సమావేశములలో ఇండియాకు కూడ స్థానము ఉన్నదని చెప్పుచున్నారు. కామన్వెల్తు వ్యవహారములలో, ప్రపంచ పరిణామములలో భారతదేశమునకు కూడ పాలుకలదని పలుకుచున్నారు. అవి యన్నియు వట్టి యబద్ధములు. ఇండియా తరఫున ఆయాసమావేశములకు హాజరగుచున్న వారందరు బ్రిటిషు ప్రభుత్వము నియమించి పంపుచున్నవారే. ఆ వెళ్ళుచున్న ప్రతినిధుల వాక్కులలో ప్రజాభిప్రాయము ప్రతిఫలించుటలేదు. పైపెచ్చువారు ఇండియాకు అనర్థము తెచ్చిపెట్టుచున్నారు...

నిజమైన స్వాతంత్ర్యము వంటిదే అధినివేశ ప్రతిపత్తి (కామన్వెల్తులోనే ఒక స్వతంత్ర రాజ్యమై యుండుట) ఒకటి కలదని బ్రిటిషు వారు ప్రపంచమునకు నచ్చబలుకుచున్నారు. అది వట్టి భ్రమ. సంపూర్ణ స్వాతంత్ర్యమునకు, దాస్యమునకు మధ్యస్థితి మరొకటి యుండదని ప్రపంచము గుర్తించునుగాక ! ...... "

ఆ తరువాత వెడ్జివుడ్ బెన్ ఇట్లు ఉపన్యసించెను—

"బ్రిటిష్ పరిపాలనము క్రూరముగ నున్నదని పటేల్ చెప్పిన దానికి సమాధానముగ నేను ఇండియా సెక్రటరీనై యుండినప్పటి అనుభవము సూచింపగలను. 1929 నుండియు మా లేబరు ప్రభుత్వము భారత జాతీయ కాంగ్రెసుతో సమాధానపడుటకే ప్రయత్నించినది. లేబరు ప్రభృతుల సుహృద్భావమును వారు శంకించి శాసనోల్లంఘనోద్యమమును లేవదీసి కొన్ని నెలలపాటు సాగించినారు. పటేల్ చెప్పినట్లు వేలమంది బందీలైనారు; ఔను. భారత ప్రభుత్వమైనా, బ్రిటిష్ ప్రభుత్వమైనా దేశము అరాజకం కాకుండ చూడవలెనుకదా ! కాని సమాధాన యత్నములు సాగుచునే వచ్చినవి. చివరకు గాంధీజీ, వైస్రాయి కలసికొన్నారు. ఒడంబడిక జరిగినది. ఖైదీలు విడుదలయైనారు. ఆ సంగతి మాత్రము పటేల్ చెప్పలేదు.

బ్రిటిష్ పరిపాలనమును గురించిన అనేక విమర్శనలు నేను అంగీకరించుచున్నాను. కాని 150 సంవత్సరాల క్రిందటి పరిపాలనా విధానమును ఎవరు సమర్థింపగలరు ? ఇండియా విషయములో బ్రిటిష్ ప్రభుత్వము చాలా పొరపాట్లు, అపరాధములు చేసియుండవచ్చును. కాని నేను లేబరు మంత్రులలో ఒకడనై యుండినప్పుడు మేము భారతీయుల స్వాతంత్ర్య వాంఛను అంగీకరించినాము. నేనును, వైస్రాయిగ నుండిన

ఇర్విన్ ప్రభువును... భారత నాయకులతో సహకారము 'అర్థించినాము. భారత ప్రతినిధులు బ్రిటీషు ప్రభుత్వ ప్రతినిధులతో సమాన హోదాలో సంప్రదించుటకు అవకాశములు కల్పించినాము. నామటుకు నేను బ్రిటిషు పెద్దలలో హృదయ పరివర్తనము కలిగినదని భావించుచున్నాను. భారత నాయకులు, బ్రిటిషు అధికారులు పరస్పరము స్నేహ సౌహార్ద్ర సహకారములు పెంపొందించుకొనుట ద్వారా భారత స్వాతంత్ర్యము సిద్ధించునని భావించుచున్నాను. భారతదేశ సౌభాగ్యమును వాంఛించువారు ఆ దేశములోని మత వైషమ్యములు నశించవలెనని యాశించుచున్నారు.

భారత సమాఖ్య ఏర్పడుటకు హిందూ మహమ్మదీయ సమస్య పరిష్కారము కావలెను. ఈ రెండు జాతులవారి విభేదాలు తీవ్రతమములు. సత్వర పరిష్కరణీయములు కావు. కాబట్టి రౌండుటేబిల్ సమావేశములో మేము వారికిచ్చినది సంపూర్ణ స్వాతంత్ర్యము మాత్రము కాదని ఒప్పుకొనుచునే యున్నాను..."

**పటేల్ జవాబు**

వెడ్జివుడ్ వాదమును విఠల్ భాయ్ తన వాక్చాతుర్యముతో ఖండించి ఈవిధముగ తన ముగింపు వాక్యములు నుడివెను.

"మాకు సంపూర్ణ స్వాతంత్ర్యము కావలెను. అంతకు వీసము తక్కువైనను మాకు అక్కర్లేదు. ఇండియా సమస్య వచ్చుసరికి లేబర్ ప్రభుత్వమైనను, మరొక ప్రభుత్వమైనను ఒక్కటే. రాంసే మాక్డొనాల్డు ప్రతిపక్షములో నున్నప్పుడు ఇండియాకు స్వాతంత్ర్యమును వాగ్దత్తము చేసెను. కాని అతడు ప్రధానమంత్రి, వెడ్జివుడ్ బెన్ ఇండియా కార్యదర్శియైన మరుక్షణమే 80,000 మంది భారతీయులను, గాంధిమహాత్మునితోసహా జైళ్ళలో బంధించివేశారు. భారతదేశము స్వతంత్రమై తన రాజ్యాంగమును తానే రచించుకొనవలెను. తన నాగరికతను తానే పెంపొందించుకొనవలెను. అంతవరకు ప్రపంచశాంతికల్ల."

ఈవిధముగ అమెరికాలో విఠల్ భాయ్ కావించిన కృషి చిరస్మరణీయము.

---

# 8

## అవసానదశ

అమెరికాలో నున్నప్పుడే విఠల్‌భాయ్ ఆరోగ్యము పూర్తిగ చెడిపోయినది. అసలే ముసలితనము. అందుచు శరీరము వ్యాధిగ్రస్త మయ్యెను. ఆపైని అమెరికాలో నిరంతర పరిశ్రమము. శరీరము నానాటికి దుర్బలమైపోయెను.

అమెరికానుండి పటేల్ ఇంగ్లండునకు వచ్చెను. అప్పుడు ఇంగ్లండు ఐర్లండుల మధ్య రాజకీయ వ్యవహారములు క్షుతిమించి యుండెను. ఐర్లండు ఎన్నికలలో డివెలరాపక్షము విజయముగాంచి, అధికారము చేపట్టెను. ఐర్లండునకు డివెలరా ఇంచుమించు నియంత యయ్యెను. ప్రజావాహిని అతని ననుసరించి ప్రవహించుచుండెను. ఒకప్పుడు స్వదేశములో నుండుటకుకూడ వీలులేక డివెలరా విదేశాలకు పారిపోయి తలదాచుకొనెను. అట్టివాడు నేడు బ్రిటన్‌కు పక్కలోబల్లెముగా తయారయ్యెను.

అధికారములోనికివచ్చిన మరుక్షణమే ఐర్లండు ప్రయాణము డివెలరా- ఇన్నాళ్ళనుండియు ఐర్లండు బ్రిటన్‌కు కట్టుచుండిన కప్పమును, నిలిపి వేసెను. ఈ సమయమున విఠల్‌భాయ్ ఇంగ్లండులోనుండెను. ఒకసారి ఐర్లండు రావలసినదిగా డివెలరా విఠల్‌భాయ్‌కి ఆహ్వానమంపెను.

విఠల్‌భాయ్ ఐర్లండువెళ్ళి డీవెలరాతో సంభాషించినాడు. బ్రిటన్-ఐర్లండ్లమధ్య రాజకీయ విభేదాలను సర్దుబాటుచేయు నిమిత్తము పటేల్ మధ్యవర్తిగా పనిచేయగలడని ఆరోజులలో ఊహాగానము బయలుదేరినది. మొత్తముమీద ఐర్లండులో అతడు కొంతపరిశ్రమ చేయవలసి వచ్చినది. తత్ఫలితముగా అతని ఆరోగ్యము మరింత చెడిపోయెను.

విదేశములలో ఇన్నాళ్ళు గడిపిన తరువాత విఠల్‌భాయ్ హృదయము మాతృదేశమునకు తిరిగిపోవలెనని తహతహలాడెను. కాని అది తీరని కోరికయైనది. చికిత్సకై మరల వియన్నాకు వెళ్ళవలసివచ్చెను.

ఈ సమయమున ఇండియాలోకూడ రాజకీయ పరిణామములు వడివడిగ సాగిపోవుచుండెను. హరిజనాభ్యుదయముకొరకై గాంధిమహాత్ముడు

మూడువారాలు కఠినోపవాస దీక్షగైకొనెను. అందుచేత బ్రిటిషు అధికారులాయనను జైలునుండి విడుదలచేశినారు. శాసనోల్లంఘనోద్యమమును కట్టిపెట్టి ఇక హరిజనాభ్యుదయమునకై కృషిచేయుటకు గాంధిజీ సంకల్పించెను.

ఈ సమాచారము వియన్నాలోనుండిన విఠల్‌భాయ్‌కి తెలిసెను. అప్పుడు సుభాస్‌చంద్రబోస్ కూడ అచ్చటనేయుండెను. వారిద్దరికిని గాంధిజీ సంకల్పము రుచించలేదు. వారిద్దరును కలిసి గాంధిజీ చేయుచున్న పనిని తీవ్రముగ విమర్శించుచు ఒక ప్రకటనము చేసినారు:

"ఇప్పుడు గాంధిజీ అనుసరించుచున్న విధానము ఓటమిని అంగీకరించుటేయగుచున్నది. ఇంతటితో గాంధీజీ తన నాయకత్వమును కోల్పోయినాడన్నమాట. కనుక ఒక క్రొత్తపద్ధతిలో, నూతన విధానములో కాంగ్రెసుసంస్థ పునర్నిర్మాణము చెందవలసియున్నది. అట్టి పునర్నిర్మాణమునకు క్రొత్త నాయకు డవసరము. తన జీవనసూత్రాలకు విరుద్ధమైన ఒక క్రొత్త కార్యక్రమాన్ని సృష్టించుటకుగాని, ఒక నూతన విధానాన్ని అమలు చేయుటకుగాని గాంధిజీ అంగీకరించడు. అట్టిపని ఆతనివల్ల మన ఆశింపజాలము. అట్లుగాక కాంగ్రెస్‌సంస్థ పునర్నిర్మాణము నందుట మంచిది; లేదా కాంగ్రెసులోనే ఒక క్రొత్తపార్టీ సమాయత్తము కావలె. సహాయనిరాకరణోద్యమము నిలిపివేయరాదు. పైగా ఆయుద్యమమును మరింత తీవ్రరూపమున కొనసాగించవలె; స్వాతంత్ర్య సమరము అన్నిరంగములలోను విజయవంతముగ సాగవలసినదే"

ఈ ప్రకటనము విఠల్‌భాయ్ ధమనులలో...ముసలితనమునందు కూడ...ప్రవహించుచుండిన యువక రక్తమును వ్యక్తము చేయుచున్నది. సాధారణముగ ముసలితనము వచ్చుసరికి గుండె పిరికితనము వహించుట పరిపాటి. కాని విఠల్‌భాయ్ విషయములో అట్లుకాదు. సహాయ నిరాకరణోద్యమమును అనగా స్వాతంత్ర్య సమరమును నిలుపుట అవివేకమని ఆతడు ఆ ప్రకటనములో విశదము చేసినాడు. భారత స్వాతంత్ర్య యువక వీరుల పజ్జ నిలువదగిన మానిసి.

సహకార మార్గమున...ఇండియా - బ్రిటనుల పరస్పర సంప్రదింపులతో...భారతాభ్యుదయమునకు మార్గము వేయవలెనన్న మితవాది తత్త్వమే విఠల్‌భాయ్‌ని మొదటినుండి. అందుచేతనే అసెంబ్లీలోనుండి చేయదగిన దంతయు చేసినాడు. కాని చివరకు ఆ సహకార మార్గము పనికిరాదన్న నిశ్చయమునకు వచ్చినాడు కూడ.

కాంగ్రెసులోనే కొంతవరకు పిరికిపాలు కనిపించునేమో! విఠల్ భాయ్ హృదయములో మాత్ర మట్టి పిరికిపాలు మచ్చుకైనను కానరావు. కనుక నే స్వాతంత్ర సమరము అన్నిరంగములలో సాగింపుడని యాక్రోశించినాడు. అట్లు సాగింపలేని పక్షములో కాంగ్రెసు పునర్నిర్మాణము నందవలెను; లేదా కాంగ్రెసులోనే మరొకపార్టీ లేచి తల్లి సంస్థకు క్రొత్తజీవం పోయవలెనన్నాడు. అప్పుడు పటేల్ ఆశించినది నేటి కాంగ్రెసు సోషలిస్టుపార్టీయే అని స్మరించక మానడు.

అవసానదశ

పటేల్ జీవితములో అదియే చివరి ప్రకటనము. క్రమేణా అతని వ్యాధి హెచ్చినది. మంచమెక్కినాడు. ఇంతలో ఇండియాలో దేశప్రియ జే. యమ్. సేన్ గుప్త మరణించెను. ఆవార్త వియన్నా చేరినది. అతని మరణమునకు విచారము తెలుపు నిమిత్తము వియన్నాలో ఒక సభజరిగెను. ఆసభకు పటేల్ అధ్యక్షుడు. వ్యాధిగ్రస్తుడై అతి బలహీనముగ నున్నందున మిత్రులాతనిని మెమ్మదిగా నడిపించుకొని సభకు తెచ్చినారు.

ఆసభలో ఉపన్యసించుచు పటేల్ అనేక భారతదేశభక్తుల మరణమును జ్ఞప్తికి తెచ్చినాడు. "దేశబంధు చిత్తరంజన్‌దాస్ మనలను వీడిపోయెను. పండిట్ మోతీలాల్ నెహూరు స్వర్గస్థుడైనాడు. ఇప్పుడు జే. యమ్. సేన్ గుప్త పరమపదించెను. ఈసారివంతు నాది" అన్నాడు.

తనకు మృత్యువు సమీపించుచున్నదని ఆ మహనీయు డెరిగియే యుండెను. అయినను ఎప్పటివలె సంతోషముగనే యుండెను. లేశమాత్రమును దుఃఖపడలేదు. మాతృదేశ భవిష్యత్తునుగూర్చి సదా చింతించుటయు మానలేదు.

అమెరికా విడిచివచ్చిన తరువాత విఠల్ భాయ్‌కి గుండెజబ్బు ఆరంభమయ్యెను. దానికి చికిత్సపొందగా కొంతవరకు ఉపశమించినది. వెంటనే అతడు వియన్నానుండి జినీవాకు ప్రయాణమై వెళ్ళెను. ప్రయాణాయాసమువల్ల గుండెబాధ మరల పొడసూపి అధికమయ్యెను. జినీవాలో ఒక వైద్యుడు పరీక్షచేసి, అక్కడికి నాతిదూరములోఉన్న ఒక ఆసుపత్రికి వెళ్ళవలసినదిగా సలహా యిచ్చెను.

అక్కడ పటేల్‌కు మూడు నాలుగు రోజులు జ్వరమువచ్చి తగ్గిపోయెను. కాని గుండె బాధ అధికమయ్యెను. వైద్యులు, నర్సులు ఎంతో జాగరుకతతో అతనిని కనిపెట్టి చికిత్సలు చేసినారు. ఎనిమిది

రోజులు అతడు జీవన్మరణముల మధ్య ఊగులాడెను. పటేల్ మిత్రుడైన వియన్నా వైద్యుడుకూడ అచ్చటికి వచ్చెను. పలువురు మిత్రులు అతని చెంతనే యుండి సేవించినారు. కాని లాభములేక పోయెను.

అట్టి అవసాన దశలో వివిధ దేశములనుండి మిత్రులు, అనుయాయులు అతనికి సానుభూతి లేఖలు వ్రాసినారు. ఇర్విన్ ప్రభువుకూడ ఈ విధముగ ఒక స్నేహ పిచ్ఛిలమగు ఉత్తరము వ్రాసినాడు.

"లోగడ నేను మిమ్ములను కలసికొన్నప్పుడు మీరు సుస్తిగానే ఉన్నారు. ఇటీవలనే మిస్ హారిసన్ తమ ఆరోగ్య పరిస్థితులను తెలుపుచు ఒక యుత్తరము వ్రాసినది. నేనును, ఇర్విన్ సతియు మిక్కిలి విచారించినాము. మీరు చాలా బాధలలో నున్నారుకాబోలు పాపము! మిమ్ములను నేను సదాజ్ఞాపకము చేసుకొనుచున్నాను."

సర్ బి. యల్. మిత్తర్, అతని సతియు పటేల్‌ను చూచుటకు వచ్చిరి. వెల్లింగ్‌డన్ దంపతులను అడిగినానని చెప్పవలసినదిగా పటేల్ వారిని కోరెను. ఈ ప్రపంచములో తన జీవయాత్ర ముగియనున్నదని యాతనికి తెలిసియే యుండెను.

మరణశయ్యపై నుండియు ఈ దేశభక్తుడు తన మాతృదేశమును స్మరించుచునే యుండెను. తన జీవితమంతయు భారతసేవకు వినియోగింపగలిగినా నన్న సంతృప్తితో అతడు 1933 అక్టోబరు 22 తేదిన తన భౌతిక దేహమును చాలించెను.

"ఇవే నాభారతదేశీయులకు, తదితర మిత్రులకు నా హృదయపూర్వక ఆశీస్సులు. అచిరకాలంలోనే నామాతృభూమి సంపూర్ణస్వతంత్ర్యము నందగలదని భగవంతునికి ఇదే నాతుది ప్రార్థనము"– ఇవియే ఆ కృతార్థజీవి తనచుట్టునున్న మిత్రులతో పలికిన తుదిపలుకులు.

పటేల్ అవసానదశయందు అతనిని కనిపెట్టుకొనియుండిన సకలవిధముల సేవించిన పుణ్యమూర్తి శ్రీ సుభాస్‌చంద్రబోస్. కన్నకొడుకువలె... మున్ముందు నేతాజీకానున్న ఈ సుభాస్‌బాబు... పటేల్‌ను కంటవత్తిడుకొని కాపాడెను. కానిదైవ మన్యథాతలచెను. సుబాస్‌బాబు అంకమే విఠల్‌భాయికి మరణశయ్య యయ్యెను.

ఆసమయమున సుబాస్‌చంద్రుని నేత్రగోళాలలో ఆ ముసలివీరునకు ఎట్టితేజోమయ జ్యోతులు కనిపించినవో ఆయనకే తెలియవలె. ఈయువకుడు భారతస్వాతంత్ర్య సంపాదనకై మహాసాగరములో దుముకగలడు; ప్రళయాగ్ని గుండములలో ఈదునాడగలడు – అని పటేల్ తలపోసినా

డేమో, చనిపోవుచు తన యాస్తియంతయు అనువక యోగ్యునిపేర విల్లు నామా వ్రాసినాడు; ఆ ధనమంతయు విదేశాలలో భారతప్రచారమునకై సద్వినియోగము చేయవలసినదిగా కోరుచు ప్రాణములు నిశ్చింతగా విడిచి నాడు. ఆయాస్తి సుభాస్‌చంద్రునకు దక్కలేదు. కానియతడు పటేల్ తనకు విధించిపోయిన కర్తవ్యమును మాత్రము అక్షరాల పాటించెను.

జీవితమంతయు విదేశములలోనే ప్రవాసియై గడుపవలసి వచ్చిన బోసుబాబు నిరంతరము విదేసములలో భారతప్రచారము తీవ్రముగ సాగించెను. చివరకు విదేశములందే యుండి "అజాద్ హింద్ ఫౌజును" నిర్మించి భారత స్వాతంత్ర్యమును సంపాదించుటకు అఖండమైన కృషిచేసి విఫలుడైననేమి?...అమరుడైనాడు. భావిభారత స్వాతంత్ర్య సమరమునకు పునాదులు యేర్పరచినాడు.

విఠల్‌భాయ్ పటేల్ భౌతిక దేహము మాత్రమే మనలను వీడి పోయినది. స్వాతంత్ర్యపిపాసా పూర్ణమైన అతని పరిశుధాత్మ ప్రతిభారతీ యునిలో వచ్చి ప్రవేశించినది. స్వతంత్ర భారతశాసన సభలలో ఆరాజ నీతి ధురంధరుని చిత్రపటములు ఆవిష్కరింపబడు కాలము సమీపించినది.

**అంత్యక్రియలు**

విఠల్‌భాయ్ పటేల్ పరదేశములో మరణించుట మన దురదృష్టము. అతడు స్వదేశమందు గాని, పరదేశమందు గాని ... ఎచ్చట నున్నను స్వదేశీయుల క్షేమమునే వాంఛించెను. తన దేశీయులను, మిత్రులను హృదయ పూర్వకముగ ఆశీర్వదించి మరి ప్రాణములు విడిచినాడు. భారతదేశము త్వరలో స్వతంత్రము కావలెననియే మృత్యువేదనలో కూడ అతని అంతిమప్రార్థన.

తాను యావజ్జీవము భారతదేశమును సేవించినాడు. తన తను ధన ప్రాణములు భారతావనికి అంకితములైనవి. తన శవమును మాతృభూమికి చేర్చుడని యాతడు మిత్రులను కోరెను. సుభాస్‌చంద్రభోస్ మొదలగు వారు వలసిన యేర్పాట్లన్నియు కావించి యాతని శవమును భారతదేశము నకు పంపించినారు.

ఆయమృతజీవి శవపేటికను మోసుకొని ఓడ బయలుదేరెను. ఏడన్ రేవులో ఓడ ఆగినప్పుడక్కడి ప్రజలు తండోప తండములుగ చూడవచ్చిరి. శవపేటిక అందరకు కనుపించునట్లు ఓడలో ఎత్తున నుంచ బడెను. ప్రేక్షకులు ఖద్దరునూలు, పువ్వులు ఆపేటికపైనుంచి గౌర వించిరి.

దహనక్రియలు బొంబాయిలో "చౌపతి" అనుచోట జరిగించుటకు నిర్ణయించిరి. తిలక్ దహనక్రియలుకూడ అచ్చటనే జరిగెను. దహనక్రియలు జరిగించుటకు బొంబాయిలో ఒక కమిటీ ఏర్పడెను. 'చౌపతి' లో విఠల్ భాయ్ అంత్యక్రియలు జరుపుటకు అనుమతింపవలసినదని ఈ కమిటీ మ్యునిసిపాలిటీకి అర్జీపెట్టుకొనెను. మునిసిపాలిటీవారు దానిని రాష్ట్ర ప్రభుత్వ పరిశీలనకు పంపినారు.

కాని బొంబాయి ప్రభుత్వము పటేల్ దహనక్రియలు 'చౌపతి' లో జరిగించుటకు సమ్మతించలేదు. అందుకు అనుమతించినచో మున్ముందు కూడ మరణించిన భారతనాయకులకు, దేశసేవకులకు అచ్చటనే అంత్య క్రియలు జరుపుచుందురని బొంబాయి ప్రభుత్వము భయపడెను.

ఆ ప్రదేశములో తిలక్ అంత్యక్రియలు జరిగించుటకు బొంబాయి ప్రభుత్వమువారు అంతగా తర్జనభర్జనలు పడలేదు. అచ్చట తిలక్ అంత్య క్రియలు జరిగించిన తరువాత ప్రజలలో కొంతమంది కది అసహ్యాకర మయ్యెనని ప్రభుత్వమునకు తెలియవచ్చినదట! పటేల్ దహనక్రియ లక్కడ జరిపించుటకు తాము సమ్మతింపకపోవుటకు అదొక కారణముగ పేర్కొన్నారు. అదియునుగాక-

తిలక్ దహన క్రియలు జరిగినచోట ఆవరణ ఏమియు నిర్మించ రాదనియు, అతని జ్ఞాపక చిహ్నముగ ఎట్టి కట్టడమును అచ్చట నిలుప రాదనియు ప్రభుత్వము ఆదిలోనే నిషేధించియుండెను. కాని కాలక్రమ మున బొంబాయి కార్పొరేషన్ వారి కోరిక ననుసరించి మొదట ఒక ఆవ రణము నిర్మించుటకును, తరువాత ఒక కట్టడమును నిలుపుటకును గూడ ప్రభుత్వము సమ్మతించెను. అందుకుగాను అదనముగ నూరు చతురపు గజ ముల స్థలము కూడ వినియోగింప బడినది.

ప్రస్తుతము విఠల్ భాయ్ దహనక్రియలు మాత్రమే "చౌపతి" లో జరిగించుటకు కమిటీ అనుజ్ఞ నడుగుచున్నది. స్మారక చిహ్నమేమియు నిర్మించుటకు అనుజ్ఞను వీరడుగుటలేదు. కాని మున్ముందు అట్టి కోరికను కూడ వెలిబుచ్చగల అవకాశము లేకపోలేదు. అంతేగాక కాలక్రమమున ప్రము ఖవ్యక్తులు ఎవరు చనిపోయినను అక్కడే దహనక్రియలు జరుపుటకు వారి అనుచరులు వాంఛింతురు. ప్రభుత్వమందుకు అనుమతింపవలసి వచ్చును. ఈవిధముగా ఆ ప్రదేశము చివరకు హిందూ శ్మశానభూమి అయిపోవును. అందుకా పరిసరముల నివసించుచున్న ప్రజలు ఇష్టపడరేమో! ఈ మొద లైన విషయము లన్నియు ఆలోచించి బొంబాయి ప్రభుత్వము "చౌపతి" లో విఠల్ భాయ్ దహనక్రియలు జరుగుటకు అనుమతించలేదు.

అందుచేత కొందరు అసెంబ్లీ సభ్యులు వైస్రాయికి కూడ అర్జీలు పెట్టినారు. కాని లాభములేకపోయెను. రాష్ట్రీయ ప్రభుత్వ వ్యవహారములలో తాను జోక్యము కలుగజేసుకొనజాలనని వైస్రాయి చెప్పివైచెను. కాగా చౌపతిలో దహనక్రియలు జరిగించవలెనన్న కోరిక ఉపసంహరించుకొన బడెను.

అప్పుడు విఠల్‌భాయ్ సోదరుడు వల్లభాయి జైలులో నుండెను. అన్నగారి అంత్యక్రియల సందర్భమున అతనిని విడుదల చేయవలసినదిగా బొంబాయి ప్రభుత్వమును కోరటమైనది. ప్రభుత్వము వారతనిని మూడురోజులు మాత్రము విడుదలచేయుటకు అంగీకరించినారు. ఆ మూడు రోజులలోను అతడెచ్చటను రాజకీయోపన్యాసము లివ్వరాదు - ఆమూడు రోజుల యనంతరము ఆతడు తిరిగివచ్చి అధికారుల వశము కావలెను- అని షరతులను విధించినారు. ఆ షరతులకు లొంగియుండుటకు వల్లభాయ్ ఒప్పుకొనలేదు. అందుచేత ప్రభుత్వ మతనిని విడుదల చేయలేదు.

విఠల్‌భాయ్ శవపేటిక ఓడలో బొంబాయి రేవు చేరినది. ఇరువదిమంది మాత్రమే పోలీసులు ఓడలోనికి పోనిచ్చినారు. వారిలో శ్రీమతి సరోజిని నాయుడు, బి. జి. హోర్నిమన్, కె. యఫ్. నారిమన్, జమ్నదాస్ మెహతా, కేశవభాయ్ పటేల్ మొదలగువారున్నారు. ఆ రాత్రి శవపేటికను జి. టి. ఆసుపత్రిలో ఉంచినారు.

మరునాడు ఉదయము ఆ శవపేటికను ఏషియన్ బిల్డింగునకు తెచ్చినారు. అచ్చటనుండి ఊరేగింపు ఆరంభ మయ్యెను.

శవపేటికను ఒక మోటారులో ఉంచినారు. విఠల్‌భాయ్ ఫొటో ఒకటి పెద్దది డ్రయివరు కూర్చొనుచోట ఎత్తుగ కట్టినారు. ఆరు వరుసలుగా జనము నిలబడినారు. దుకాణము లన్నియు మూయబడినవి. నిశ్శబ్దముగ, శాంతియుతముగ ఊరేగింపు సాగినది. బంధువులు, మిత్రులు, భక్తులు—యావన్మంది శవపేటికను పుష్పాలతో నింపిరి.

హిందువులు, మహ్మదీయులు, సిక్కులు. పార్సీలు—అన్ని మతములవారు ఊరేగింపులో పాల్గొనిరి. కాంగ్రెసు జెండాలు పుచ్చుకొని వాలంటీరుదళము వచ్చెను. ఊరేగింపు కొంతదూరము సాగిపోయిన తరువాత నలుగురు స్త్రీ వాలంటీరులు మోటారునకు ఎదురుగా నిల్చి, మృతనాయకుని ముఖము అందరికు కనబడునట్లు ఉండవలెనని పట్టుపట్టిరి. శవమును పెట్టెలోపెట్టి మోసుకొని పోవుట హైందవాచారము కాదని వారు వాదించిరి. కాని శ్రీమతి సరోజిని నాయుడు వారిని సమాధానపరచెను. ఊరేగింపు సాగినది.

కార్పొరేషన్ ముందు ఊరేగింపు కాసేపు ఆగినది. కార్పొరేషన్ సభ్యులువచ్చి తమ లేటు బొంబాయి మేయర్ శవమును పూలమాలలతో అభిషేకించినారు. తరువాత కలబాదేవి వీధిలోకి ఊరేగింపు వచ్చుసరికి లక్షలమంది ప్రజలు వచ్చి చేరినారు. అయిదంతస్తుల మేడలమీద నుంచి పుణ్యాంగనలు పూలవర్షము కురిపించినారు.

మూడునాలుగు లక్షలమంది పురుషులు, స్త్రీలు, పిల్లలు, శుద్ధ ఖద్దరు ధరించి శవపేటికను అనుసరించి స్మశాన వాటికకు వచ్చినారు.

'మహానుభావుడు' 'కృతార్థజీవి' 'గొప్పరాజకీయ దురంధరుడు' 'అబ్రహాం లింకొలన్‌వలె సామాన్య కర్షక కుటుంబమునుండి అసెంబ్లీ అధ్యక్షపీఠమునకు ఎగబ్రాకినాడు' -- ఈవిధముగ ఎవరికితోచినట్లు వారు ఆ యమృతజీవిని గూర్చి వర్ణించి చెప్పుకొన్నారు. పట్టణమంతయు హర్తాలు చేసినది.

స్మశానభూమి చేరినతరువాత శవమును పెట్టెలోనుండి బైటికి తీసినారు. జినీవా డాక్టర్లు బహుజాగరూకతతో శవమును కొన్నిసంవత్సరములవరకు నిలువ యుండగలుగునట్లు చేసినారు. శవముపై కాశ్మీరు శాలువ కప్పియున్నది. భగవద్గీతా పుస్తకము శవముపైనున్నది.

గంగాజలముతెచ్చి శవముపై చల్లినారు; గంధము పూసినారు. ఒక తులసిమాల, భగవద్గీతా పుస్తకము శవముపై ఉంచినారు.

శ్రీమతి సరోజినినాయుడు ఉపన్యసించినది. విఠల్‌భాయ్ శవము మరి కాసేపటిలో భస్మీభూతము కానున్నది. కాని అతనియాత్మ భారత స్వాతంత్ర్య సమరయోధులకు సదా మార్గదర్శిగ ఉండగలదు - అని ఆమె నుడివెను.

విఠల్‌భాయ్ పటేల్ నాయకులకు నాయకుడు - అన్నాడు జమ్నదాస్ ద్వారక్‌దాస్.

అవసానదశలో విఠల్‌భాయ్‌ని సేవించి, అతడు మరణించిన తరువాత శవమును ఇండియాకు పంపించిన సుభాస్‌బాబునకు అందరును కతజ్ఞతాభి వందనములు తెలిపిరి.

సర్దార్ వల్లభాయ్ కుమారుడు చితికి నిప్పు అంటించినాడు. విఠల్‌భాయ్‌కి జయజయ ధ్వానములు మిన్నుముట్టినవి. చుట్టును అగ్నిజ్వాలలు బంగారు తమ్మిపూవు రేకులవలె విరబారి విఠల్‌భాయ్ మృత శరీరమును ఆచ్ఛిన్నవి. ఒక మహోజ్వలతార మింటిదెస కెగబ్రాకి పోయినది.

ఓం తత్సత్. —— వందేమాతరం!

Printed at M.P. Press, B.Z.A - Q H K No- 58 - 500

